# ఆకరాలు

## తెలుగు వ్యాకరణ వ్యాస సంపుటి

కూర్పరి :

**యలుగూరి వెంకటరెడ్డి,**

సీనియర్ తెలుగు పండిట్



పరిష్కర్త :

**వసంతకుమార్**

ఆంధ్రోపన్యాసకులు

ఎం.కె.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, దేవరకొండ.

# "ఆకురాయి"

(వ్యాకరణ వ్యాస సంపుటి)
ఉన్నత పాఠశాలల విద్యార్థులకు

ప్రథమ ముద్రణ : జూన్, 1999
ప్రతులు : 1000 వెల రు. 20/-

"కూర్పు"
**యలుగూరి వెంకటరెడ్డి,** బి.ఎ.,(తెలుగు)బి.యెడ్.
సీనియర్ తెల్గుపండితులు
జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, పులిచర్ల.

"పరిష్కర్త"
శ్రీ వసంత కుమార్
ఆంధ్రోపన్యాసకులు,
ఎం.కె.ఆర్. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, దేవరకొండ.

ప్రతులకు:
వై. వెంకటరెడ్డి
ఇంటి. నెం. 19-177/4, గాంధీనగర్,
దేవరకొండ - 508 248.

ముద్రణ :
పార్థసారథి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, నల్లగొండ.

# అభిప్రాయము

జిల్లా ఉపవిద్యా శాఖ కార్యాలయం,
దేవరకొండ.
తేది: 28-5-1999.

శ్రీయలుగూరి వెంకటరెడ్డి గారు నా యొక్క పాఠశాల పర్యవేక్షణ పరిధిలోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల పులిచర్లలో తెలుగు పండితునిగా పనిచేస్తు విద్యార్థులకు తెలుగు భాషా జ్ఞానాన్నందిస్తూ, తన భోదనానుభవమును జోడించి వ్యాకరణాంబుధి నుండి ఎంతో ఓర్పుతో, నేర్పుతో విద్యార్థులకు అచ్చ తెలుగులో "ఆకురాయి" అనుపేరిట వ్యాకరణ వ్యాస, జాతీయములు, లేఖలు విగ్రహసమాసములు యిత్యాది చిట్టి ముత్యములను ఏరికూర్చిన యీ చిరుపొత్తమును అందించి నందులకు సంతోషము ఇయ్యది 6వ తరగతి నుండి 10వ తరగతి వరకు ప్రతి విద్యార్థికి కావలసిన కనీస పరిజ్ఞానమును అందిస్తుందనడంలో సంధియములేదు. ఎందుకనగా యీవ్యాకరణ సంపుటికిడిన పేరు "ఆకురాయి" అమనది విద్యార్థి మెదడుకు పదును పెట్టువరికరమని చెప్పవచ్చును.

కావున తెలుగు భాషా పండితులు యీపూస్తకాన్ని తమ విద్యార్థులచేత విరివిగా వినియోగింప చేయుట అత్యంతావశ్యము. తెలుగు భాషాధ్యాపకునిగా శ్రీ యలుగూరి వెంకటరెడ్డి గారు విద్యార్థులోకోపయుక్త మగు రచనా పరంపరలో యీ అమూల్య పొత్తమును అందిస్తున్నందులకు వారికివే నా హృదయపూర్వక అభినందనలు

ఇట్లు
పాలపర్తి ప్రభాకర్‌రావు
జిల్లా ఉపవిద్యాశాఖాధికారి,
దేవరకొండ డివిజన్, నల్లగొండ జిల్లా.

# శుభాభినందనలు

శ్రీ యలుగూరి వెంకటరెడ్డి గారు, మంచికవిగా, "కలికాలం" ద్విపదకావ్యం ద్వారా ఈమధ్యనే కవితాభిమానులకు పరిచయమైనారు ఆనందం!

వీరి యొక్క రెండవ ప్రయత్నమే యీ "ఆకురాయి" విద్యార్థి కోసం రాసిన యీచిన్ని వ్యాకరణ వ్యాస సంపుటి వల్ల వీరు విద్యార్థులకు మరింత చేరువ కాగలరని ఆశించవచ్చు.

నేడు మన "అమ్మ భాష" ఎంతటి హీన స్థితికి చేరుకున్నదో భాషాభిమానమున్న ప్రతి ఆంధ్రుడు విచారించవలసిన పరిస్థితి ఆసన్నమైనది. అమ్మ, నాన్నలు, మరుగున పడిపోయి, మమ్మీడాడీలు ముందుకొచ్చారు. అన్యభాషా ప్రభావము మనలో ఆవహించి, మాతృభాషపై మనకు చులకన భావం కలుగజేస్తుంది.

ఈదయనీయ స్థితిలో తెలుగు భాషను రక్షించుకోవడమంటే, అనారోగ్యముగా ఉన్న అమ్మను రక్షించుకోవడమే! అందుకు వెంకటరెడ్డి గారి "ఆకురాయి" ఒక ప్రేరణ కాగలదని ఆశించవచ్చు. అలతి అలతి పదాలతో వీరు వ్రాసిన వ్యాకరణ - వ్యాసములు చిన్నారి విద్యార్థులకు సహితం సులభముగా అర్థమౌతు వారిలో నిక్షిప్తంగా వున్న కొద్ది పాటి ప్రతిభకు "ఆకురాయి" వలె పదునుపెట్టి ప్రతిభావంతులను జేస్తుందనడములో సందియములేదు.

తెలుగుపండితునిగా, తెలుగుభాషామతల్లికి ప్రియపుత్రునిగా, తెలుగుభాషకు తనవంతు సేవచేయకలిగినందులకు వెంకటరెడ్డి గారిని అభినందిస్తూ. . .

పదసేకరణలో విషయాలకు రూపమివ్వడములో వీరు పడిన నిర్విరామ కృషిని ప్రశంసిస్తూ ఇక ముందు కూడ వీరు నిరంతరం అటు సాహితీ సేవను సాగిస్తూ, ఇటు విద్యార్థి లోకానికి వెలుగునిస్తారని మనసారా ఆశిస్తూ.

అభిమానంతో
**వసంతకుమార్,**
ఎం.కె.ఆర్.ప్రభుత్వ డిగ్రీ కళాశాల,దేవరకొండ.

## మంచి సంకల్పము

మిత్రుడు శ్రీ యలుగూరి వెంకటరెడ్డి గారు మా సాహితీ సాంస్కృతిక సమాఖ్యలో సభ్యులై సాహితీ సౌరభాలు వెదజల్లుచున్నారు. వీరు వ్రాసిన "కలికాలం" ద్విపద కావ్యమును మా సమాఖ్య ద్వారా ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని ఆంధ్రోపన్యాసకులైన డాక్టరు కసిరెడ్డి వెంకటరెడ్డి గారిచే 22-02-1999 న పుస్తకావిష్కరణ గావింపబడిన సందర్భములో యలుగూరి వారి రచనలు వెలుగులూ తారించునవిగా యున్నవని ప్రశంసించిరి. అలాగే నాటి ఆవిష్కరణ సభకు ముఖ్య అతిధిగా విచ్చేసిన డా॥ మనన చెన్నప్ప గారు తమ ఉపన్యాసములో "పూర్వకవులు" పండితులు, రాజుల ప్రాపకము సంపాదించుటకు, పారితోషికములందుటకై, నాల్గుపాదముల పద్యరచనలు చేసి ప్రభువుల ప్రశంసలందియుండిరి కాని, యలుగూరి వెంకటరెడ్డి గారు మాత్రము రెండేపాదాలుగల ద్విపదులు సామాన్య జానపదులకు కూడ అర్థమగు సరళమైన భాషలో రచించి అందించిన వాస్తవకవి, యంటు అభినందించిరి. నేడు వెంకటరెడ్డి గారు, వీరి కూర్చిన, వ్యాకరణ, వ్యాస పరంపరలు కూడ విద్యార్థిలోకానికి జ్ఞాన సంబంధ వెలుగునిచ్చేడివిగా మున్నవి. ఎందుకంటే వీరు చేపట్టిన ప్రక్రియలో నేటి మూల్యాంకన పరీక్షా విధానమునకు కావలసిన అన్ని హంగులు తగు మాత్రంగా రూపొందింపబడి యున్నవి.

వీరు శ్రమించి కూర్చిన వ్యాకరణ వ్యాస సంపుటికి "ఆకురాయి" అని పేరిడుట ఎంతయోతగియున్నది ఎందుకనగా పండిన పైరునుకోయు కార్మికుడు కొడవలికి పదును పెట్టుటకు "ఆకురాయి" ఎంత అవసరమో పరీక్ష వ్రాయువిద్యార్థికి ఈ వ్యాకరణ వ్యాస సంపుటి అంతే అవసరమని చెప్పవచ్చును.

కాబట్టి ప్రతి ఉన్నత పాఠశాల విద్యనభ్యసించు విద్యార్థులు ఈ "ఆకురాయి" అనే ఆయుధము కల్గియుండుట అవసరమే.

ఇది పరీక్షలు వ్రాయువిద్యార్థులకు ఎంతయే ఉపయోగపడగలదని ఆశిస్తూ, యీలాంటి సుపయుక్తమగు పుస్తకాన్ని విద్యార్థిలోకానికి అందించిన తెలుగుపండితులు, కవిమిత్రులు, యలుగూరి వెంకటరెడ్డి గారు అభినందనీయులు. వారికివే నా హృదయ పూర్వక నమః సుమాంజలులు.

ఇట్లు
**నవం చంద్రమౌళి,** కార్యదర్శి
సాహితీ సాంస్కృతిక సమాఖ్య, దేవరకొండ.

# 'కలికాలం' ద్విపద కావ్య పుస్తకావిష్కరణ



(ఎడమ నుండి కుడికి)

1. శ్రీ నెమ్మికంటి సోమన్న, అడ్వకేట్
2. శ్రీ పాలపర్తి ప్రభాకర్‌రావు, డిప్యూటి డి.ఇ.ఓ. దేవరకొండ డివిజన్,
3. శ్రీ డా. మసన చెన్నప్ప, తెలుగు రీడర్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్,
4. శ్రీ మునగాల గంగాధరరావు, అడ్వకేట్, దేవరకొండ
5. డా. కశిరెడ్డి వెంకటరెడ్డి, ఆంధ్రోపన్యాసకులు, ఉస్మానియా యూనివర్సిటీ, హైద్రాబాద్,
6. యలుగూరి వెంకటరెడ్డి, కవి (కలికాలం),
7. శ్రీ వనం చంద్రమౌళి, సాంస్కృతిక సాహితీ సమాఖ్య, దేవరకొండ
8. శ్రీ పి. బిక్షపతి, డి.ఓ., ఎల్.ఐ.సి., దేవరకొండ
9. శ్రీ సయ్యద్ హుస్సేన్, ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత.

# 'కలికాలం' ద్విపద కావ్య పుస్తకావిష్కరణ



(ఎడమ నుండి కుడికి)

1. శ్రీ నెమ్మికంటి సోమన్న, అడ్వకేట్
2. శ్రీ పాలపర్తి ప్రభాకర్‌రావు, డిప్యూటి డి.ఇ.ఓ. దేవరకొండ డివిజన్,
3. శ్రీ డా. మసన చెన్నప్ప, తెలుగు లీడర్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్,
4. శ్రీ మునగాల గంగాధరరావు, అడ్వకేట్, దేవరకొండ
5. డా. కశిరెడ్డి వెంకటరెడ్డి, ఆంధ్రోపన్యాసకులు, ఉస్మానియా యూనివర్సిటీ, హైద్రాబాద్,
6. యలుగూరి వెంకటరెడ్డి, కవి (కలికాలం),
7. శ్రీ వనం చంద్రమౌళి, సాంస్కృతిక సాహితీ సమాఖ్య, దేవరకొండ
8. శ్రీ పి. బిక్షపతి, డి.ఓ., ఎల్.ఐ.సి., దేవరకొండ
9. శ్రీ సయ్యద్ హుస్సేన్, ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత.

# అధ్యాపకుల అభిప్రాయములు

"ఆయుధమునకు పదునుపెట్టు "ఆకురాయి" పంచిపెట్టు తెలుగు వెలుగు పావురాయి"

తెలుగు నభ్యసించు విద్యార్థులకు అత్యంత అవసరము అనుసరణీయ మీ "ఆకురాయి" అనే వ్యాకరణ వ్యాస సంపుటి. . . .

**ముడుంబా రాఘవాచార్యులు**, రిటైర్డ్ తెలుగు అధ్యాపకులు
ప్రభుత్వ జూనియర్ కళాశాల, దేవరకొండ.

## నివేదన

భావ ప్రకటన కొరకు మానవుడు తనకుగల ప్రత్యేక జ్ఞానాధిక్యతతో ఏర్పరుచుకొన్నదే భాష. అట్టి భాషకు సంజ్ఞాపూర్వక సంకేతములను వ్రాత రూపంగా తీర్చి దిద్దుకొన్నదే అక్షరమూలం. ఇట్టి అక్షరానికి ఉన్న అత్యద్భుత శక్తిని అధ్యయనము చేసిన గాని అవగతం కానేరదు.

భాషను అభ్యసించుటకు గాను ప్రాచీన భాషాపండితులు నిర్దేశించిన కట్టుబాట్లను క్రమపద్ధతిలో వాగ్రూపము చెడకుండా, లిఖిత రూపము మారకుండ, యుండుటకూ యేర్పాటు చేసుకొన్నదే వ్యాకరణము.

పలు భాషలకు ఆలవాలమైన ప్రపంచములో తెలుగువాడు పరభాషా పలుకుబడులకు లోనై, మాతృభాషను మరువకుండ, వన్నె తరుగకుండ, వాడి చెడకుండా, ఆదికవి నన్నయ నుండి ఆధునిక కవుల వరకు చేసిన చేయుచున్న భాషా వ్యవసాయమును పరిశీలించినచో భాషకు వ్యాకరణ మనునది, పడవకు చుక్కానివంటిదని. విశదమగుచున్నది.

అట్టి వ్యాకరణాంబుధిలో అలుపెరుగక శ్రమించి ఏరుకున్న చిట్టి ముత్యములే నాయీ ఆకురాయి కి రూపాకృతి. వ్యాకరణ పాఠమనగానే వెగటు చూపులతో అసహనాన్ని ప్రకటించు నేటి విద్యార్థులను దృష్టి యందుంచుకొని సంస్కృతనుడికారముల, సవ్వడి అనుమాత్రమైన అడ్డు రాకుండా అడుగడుగున నాయొక్క బోధనానుభవాన్ని జోడించి అతి సులభమైన మాటలద్వారా అచ్చ తెలుగులో అందించిన వ్యాకరణమే యీ ఆకురాయి. ఈ ప్రయత్నములో పాలు పంచుకొని నేను ఏరి కూర్చిన ప్రతిపదాన్ని శల్య పరీక్షచేసి పరిష్కరించిన భాషాబంధువు శ్రీ వసంత కుమార్ ఆంధ్రోపన్యాసకులు ప్రభుత్వ డిగ్రీ కళాశాల దేవరకొండ గారికి ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుకుంటూ, కోరిందే తడవుగా పుస్తకాన్ని ఆసాంతము అవలోకించి పీఠిక వ్రాసియిచ్చిన నల్లగొండ జిల్లా ఉపవిద్యా శాఖాధికారి శ్రీ పి. ప్రభాకర్ రావు గారికి, ఆలాగే మంచిసంకల్పం. అంటుమున్నుడి వ్రాసిన సాహితీ సమాఖ్య కార్యదర్శి మిత్రుడు శ్రీ వనచంద్రమౌళి గారికి కృతజ్ఞతాభి వందనములు తెలుపుకుంటూ, నాతోడి తెలుగుభాషా పండితులు ఉపాధ్యాయ మిత్రులెల్లరు నే కూర్చినవ్యాకరణ చిరుపొత్తము "ఆకురాయి" ని ఆదరించి తమ వంతు చేయూత నందింతురని ఆశిస్తూ అట, నట ఏమైన వ్యాకరణదోషములు దొర్లిన సవరించుకొనుటకు సలహాల నందించిన సంతోషంగా స్వీకరించి మలి ముద్రణ భాగ్యము కలుగజేసినచో సవరించు కోగలనని సవినయంగా మనవి చేస్తూ సెలవుకోరు. . .

మీ

**యలుగూరి. వెంకటరెడ్డి.**

# అధ్యాపకుల అభిప్రాయములు

"ఆయుధమునకు పదును పెట్టు "ఆకురాయి" పంచిపెట్టు తెలుగు వెలుగు పావురాయి"

తెలుగు నభ్యసించు విద్యార్థులకు అత్యంత అవసరము అనుసరణీయ మీ "ఆకురాయి" అనే వ్యాకరణ వ్యాస సంపుటి. . . .

**ముడుంబా రాఘవాచార్యులు**, రిటైర్డ్ తెలుగు అధ్యాపకులు
ప్రభుత్వ జూనియర్ కళాశాల, దేవరకొండ.

# నివేదన

భావ ప్రకటన కొరకు మానవుడు తనకుగల ప్రత్యేక జ్ఞానాధిక్యతతో ఏర్పరుచుకొన్నదే భాష. అట్టి భాషకు సంజ్ఞాపూర్వక సంకేతములను వ్రాత రూపంగా తీర్చి దిద్దుకొన్నదే అక్షరమూలం. ఇట్టి అక్షరానికి ఉన్న అత్యద్భుత శక్తిని అధ్యయనము చేసిన గాని అవగతం కానేరదు.

భాషను అభ్యసించుటకు గాను ప్రాచీన భాషాపండితులు నిర్దేశించిన కట్టుబాట్లను క్రమపద్ధతిలో వాగ్రూపము చెడకుండా, లిఖిత రూపము మారకుండ, యుండుటకూ యేర్పాటు చేసుకొన్నదే వ్యాకరణము.

పలు భాషలకు ఆలవాలమైన ప్రపంచములో తెలుగువాడు పరభాషా పలుకుబడులకు లోనై, మాతృభాషను మరువకుండ, వన్నె తరుగకుండ, వాడి చెడకుండా, ఆదికవి నన్నయ నుండి ఆధునిక కవుల వరకు చేసిన చేయుచున్న భాషా వ్యవసాయమును పరిశీలించినచో భాషకు వ్యాకరణ మనునది, పడవకు చుక్కానివంటిదని. విశదమగుచున్నది.

అట్టి వ్యాకరణాంబుధిలో అలుపెరుగక శ్రమించి ఏరుకున్న చిట్టి ముత్యములే నాయీ ఆకురాయి కి రూపాకృతి. వ్యాకరణ పాఠమనగానే వెగటు చూపులతో అసహనాన్ని ప్రకటించు నేటి విద్యార్థులను దృష్టి యందుంచుకొని సంస్కృతనుడికారముల, సవ్వడి అనుమాత్రమైన అడ్డు రాకుండా అడుగడుగున నాయొక్క బోధనానుభవాన్ని జోడించి అతి సులభమైన మాటలద్వారా అచ్చ తెలుగులో అందించిన వ్యాకరణమే యీ ఆకురాయి. ఈ ప్రయత్నములో పాలు పంచుకొని నేను ఏరి కూర్చిన ప్రతిపదాన్ని శల్య పరీక్షచేసి పరిష్కరించిన భాషాబంధువు శ్రీ వసంత కుమార్ ఆంధ్రోపన్యాసకులు ప్రభుత్వ డిగ్రీ కళాశాల దేవరకొండ గారికి ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుకుంటూ, కోరిందే తడవుగా పుస్తకాన్ని ఆసాంతము అవలోకించి పీఠిక వ్రాసియిచ్చిన నల్లగొండ జిల్లా ఉపవిద్యా శాఖాధికారి శ్రీ పి. ప్రభాకర్ రావు గారికి, ఆలాగే మంచిసంకల్పం. అంటుమున్నుడి వ్రాసిన సాహితీ సమాఖ్య కార్యదర్శి మిత్రుడు శ్రీ వనచంద్రమౌళి గారికి కృతజ్ఞతాభి వందనములు తెలుపుకుంటూ, నాతోడి తెలుగుభాషా పండితులు ఉపాధ్యాయ మిత్రులెల్లరు నే కూర్చినవ్యాకరణ చిరుపొత్తము "ఆకురాయి" ని ఆదరించి తమ వంతు చేయూత నందింతురని ఆశిస్తూ అట, నట ఏమైన వ్యాకరణదోషములు దొర్లిన సవరించుకొనుటకు సలహాల నందించిన సంతోషంగా స్వీకరించి మలి ముద్రణ భాగ్యము కలుగజేసినచో సవరించు కోగలనని సవినయంగా మనవి చేస్తూ సెలవుకోరు. . .

మీ

**యలుగూరి. వెంకటరెడ్డి.**

# విషయసూచిక

# భాష - అక్షరప్రకరణము

**1. భాష:-** భాషించునది మానవుడు తన భావమును ఆలోచనమ ప్రకటించు సాధనము భాష. భాషకు సంకేతము అక్షరము

**అక్షరము:-** అక్షరము అనగా (వర్ణమని కూడ అంటారు) క్షరముకానిది, నాశములేనిది. శాశ్వతముగా నిలుచునది అని అర్థము.

భాషా ప్రపంచమునకు అక్షరమే మూలము, ప్రపంచభాషలన్నింటికి పరిమిత సంఖ్యలో అక్షరములు పొందుపరచబడి యుండును తెలుగు ప్రాచీనవర్ణమాల ప్రకారము భాషకుగల అక్షర సముదాయము

(56) యాబదిఆరుగా ఇవ్వబడినవి వీటిని 3భాగములుగా విభజింపబడినది.

పదహారు : **1. అచ్చులు:-** అ,ఆ,ఇ,ఈ, ఉ,ఊ, ఋ,ౠ,ఌ,ౡ,ఎ,ఏ,ఐ,ఒ,ఓ,ఔ (16)

ముప్పది ఏడు : 2. హల్లులు:క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ,డ,ఢ,ణ,త,థ,ద,ధ,న,ప,ఫ,బ,భ,మ,య,ర,ఱ,ల,ళ,వ,శ,ష,స,హ. (37)

**3. ఉభయాక్షరాలు:-** అరసున్న,బిందువు,విసర్గ, అనునది 3 వీనిని అచ్చులతో, హల్లులతో కలిపి వాడనగును.

**ప్రస్తుత వర్ణమాల:-** అనుసారము వాడుకలో లేని వర్ణములు (8) అవి ఋ,ౠ,ఌ,ౡ,ఙ,ఞ,ఁ,ః : లను గుర్తించి పరిహరించనైనది వాడుకలోనున్నది 48 మాత్రమే

2. **వర్ణసంకేతములు:-** అచ్చులు: వీటిని, ప్రాణములు, స్వరములు అని అంటారు ఇవి మూడు విధములు

1. **హ్రస్వములు** : అ,ఇ,ఉ,ఋ, ఎ, ఒ, లు పొట్టిగా పలుకునవి.
2. **దీర్ఘములు** : ఆ, ఈ, ఊ, ౠ, ఏ, ఓ, లు పొడవుగా పలుకునవి.
3. **వక్రతమములు** : ఐ, ఔ, లు మిక్కిలి వంకరగా నుండునవి.

**హల్లులు :** వీనిని వ్యంజనములు, ప్రాణులు అని వ్యవహరింతురు. ఇవి 6 విధములు 1. పరుషములు 2. సరళములు, 3. వర్గయుక్కులు, 4. అనునాసికములు, 5. అంతస్థములు 6. ఊష్మములు

1. **పరుషములు** : క,చ,ట,త,ప,లు కఠినముగా పలుకబడునవి.
2. **సరళములు** : గ,జ,డ,ద,బ లు తేలికగా పలుకబడునవి.
3. **వర్గయుక్కులు** : ఖ,ఘ,ఛ,ఝ,ఠ,ఢ,ధ,భ, లు ఒత్తి పలుకబడునవి.
4. అనునాసికములు : ఙ, ఞ, ణ, న, మ, లు ముక్కుతో పలుకబడునవి.
5. అంతస్థములు : య,రల,వ,లు అంగిలి సహాయమున పలుకబడునవి.
6. ఊష్మములు : శ, ష, స, హ,లు ఊదిపలుకునవి.

1. వర్గ సంకేతములు:- హల్లులను 6 వర్గాలుగా విభజింపబడినవి.

"క" నుండి "మ" వరకు హల్లులను వర్గాక్షరాలు అంటారు.

| వర్గులు | 1 | 2 | 3 | 4 | 5 | గుర్తింపు |
|---|---|---|---|---|---|---|
| 1. క వర్గం | క | ఖ | గ | ఘ | ఙ | 1వ గడిలోనివి పరుషములనియు |
| 2. చ, వర్గం | చ | ఛ | జ | ఝ | ఞ | 3వ గడిలోనివి సరళములనియు |
| 3. ట, వర్గం | ట | ఠ | డ | ఢ | ణ | 5వ గడిలోనివి అనునాసికములన్నియు |
| 4. త, వర్గం | త | థ | ద | ధ | న | 2,4 గడులలోనివి వత్తు అక్షరములనియు |
| 5. ప, వర్గం | ప | ఫ | బ | భ | మ | వర్గయుక్కులనియు అందురు. |

6. ద్రుతములు : నకారమును ద్రుతమందురు. న్ నకార పొల్లు అవసరము లేనప్పుడు అరిగిపోవునది.

ఈ సంజ్ఞలు, సంకేతములన్నియు పరిభాష పదములుగా గుర్తించినచో భాషా వ్యాకరణం తేలికగా బోధపడును. (బోధపడుటకు సహకరించును.)

**వర్ణ ఉత్పత్తి స్థానములు :**

1. కంఠ్యాలు = కంఠం నుండి పలుకు వర్ణాలు = అ,ఆ,క,ఖ,గ,ఘ,ఙ, హ, విసర్గ
2. తాలవ్యాలు = దౌడల సహాయమున పలుకు వర్ణాలు = ఇ,ఈ,చ,ఛ,జ,ఝ,ఞ,య,శ.
3. మూర్ధన్యాలు = అంగిలితో పలుకు వర్ణాలు = ఋ,ౠ,ట,ఠ,డ,ఢ,ణ,ర,స
4. దంత్యాలు = దంతముల సహాయమున పలుకు వర్ణాలు = త,థ,ద,ధ,న,ల,స
5. ఓష్ఠ్యాలు = పెదవుల సహాయమున పలుకు వర్ణాలు = ఉ,ఊ,ప,ఫ,బ,భ,మ
6. అమనాసికాలు = ముక్కు సహాయమున పలుకు వర్ణాలు = ఙ, ఞ, ణ, న, మ
7. కంఠతాలువులు = కంఠం సహాయమున పలుకు వర్ణాలు = ఎ, ఏ, ఐ.
8. కంఠోష్ఠ్యాలు = కంఠం, పెదవుల సహాయమున పలుకు వర్ణాలు = ఒ, ఓ, ఔ.
9. దంతోష్ఠ్యం = దంతం, పెదవుల సహాయమున పలుకు వర్ణాలు = "వ" మాత్రమే

3. శబ్ద విభాగములు (ఐదు) సూత్రం:- సంస్కృత, ప్రాకృత, తుల్యంబగు భాష =తత్సమం

1. తత్సమములు అనగా = సంస్కృత పదములకు తెల్గు ప్రత్యయములు చేర్చగా ఏర్పడునట్టివి ఉదా॥ రామ అను సంస్కృతమునకు "ఉ" డు, ప్రత్యయము చేరి రాముడు అయినట్లు ధన + ము=ధనము గురు+వు=గురువు ఆకాశ+ము= ఆకాశముల వలె.

2. తద్భవములు : సూత్రం, సంస్కృత, ప్రాకృతభవంబగు భాష తద్భవంబు మూల పదములలో కొద్ది మార్పుతో ఏర్పడునవి. వీనినే ప్రకృతులు వికృతులు అని వ్యవహరితురు.

| <u>ప్రకృతి</u> | - | <u>వికృతి</u> |
|---|---|---|
| లక్ష్మి | - | లచ్చి |
| యముడు | - | జముడు |
| భాష | - | బాస, మొదలగునవి. |

3. దేశ్యములు:- త్రిలింగ దేశములోని ప్రజలు మాట్లాడుకొను భాష దేశ్యము.

ఉదా॥ గోడ, మేడ, దూడ, పేడ, (వ్యవహారికంగా మాట్లాడబడునవి)

4. **గ్రామ్యము:-** (వ్యవహారికపదాలు) అనగా వ్యాకరణ విరుద్ధమైనట్టివి.

ఉదా॥ పోనిక, రానీక, వస్తాడు, పోతాడు, తెస్తాడు, మొదలగునవి.

5. **అన్యదేశ్యములు:-** ఇతర భాషల నుండి వచ్చిచేరిన పదములు.

ఉదా॥ సైకిలు, మిషను, జవాబు, తమామ్, కలక్టరు, పెన్ను, నిత్యము. ఇత్యాదులు.

4. **వాక్యావయవములు:** లేక (భాషాభాగములు):- ఇవి (5) విధములు

1. నామవాచకము
2. సర్వనామము
3. క్రియ
4. విశేషణము
5. అవ్యయములు అనునవి.

**1. నామవాచకము:-** దీనినే విశేష్యము అని కూడ అందురు, పేర్లను తెలుపు పదములను నామవాచకము అంటారు.

**అవి (5) విధముల నామవాచకములు**

1. **సంజ్ఞా నామవాచకములు:-** దృవీకరించుటకు వీలైనటువంటి పేర్లు.

ఉదా॥ కృష్ణుడు, భారతము, గంగానది, గోదావరి మొదలగునవి.

2. **జాతి నామవాచకములు:-** ఒకే కూటమికి చెందిన పేర్లు తెలుపునవి.

ఉదా॥ బడి, గంట, బల్ల, పుస్తకము, కలము, మొదలగునవి.

3. **సముదాయ నామవాచకములు:-** రాశి,కుప్ప, మంద, గుంపు, దండు, వాము మొదలగునవి.

4. **గుణ నామవాచవములు:-** విశేషములతో ఏర్పడునట్టివి, అనగా, రంగు, రుచి, వాసన, గుణములతో పలుకబడునది.

ఉదా॥ నల్లబల్ల, తెల్లపిల్లి, ఎర్రచొక్కా, పచ్చజండా, మొదలగునవి. ఇంకా పేరు గుణాల ఉదాహరణలు వ్రాయవచ్చును.

5. **క్రియా నామవాచకములు:-** క్రియతో ఏర్పడునట్టివి.

ఉదా॥ వ్రాత, కోత, నేత, నడక, పాట, మాట, మొదలగునవి.

**2. సర్వనామము:-** నామవాచకమునకు బదులుగా వాడబడునది. వాక్యమును సులభతరముజేయుటకై ఉపయోగించవీలైనది.

ఉదా॥ అది, ఇది, ఈమె, ఆమె, అతడు, వాడు, వారు, మొదలగునవి.

**3. క్రియ:-** దీనిని (ధాతువు అని కూడ అందురు ఒక పని యొక్క ఉనికిని, స్థితిని తెలుపుతుంది.

ఉదా॥ తినేను, కొనెను, చూచెను, పాడెను, ఆడేను, మొదలగునవి.

**క్రియలందు రెండు రకములు:-** 1. సమాపకక్రియ, 2. అసమాపక క్రియ.

1. **సమాపకక్రియ అనగా:** ఒక పని పూర్తి చేయబడినట్లు సూచించునది

ఉదా॥ చుట్టపు చూపుగావచ్చేను, పోయెను, కలిసెను.

2. **అసమాపకక్రియ అనగా:** చేయుచున్న పని మధ్యలో ఆగినట్లు సూచించునది.

ఉదా॥ చుట్టమువచ్చి, బోజనంచేసి, నిద్రించి, మొదలగునవి.

**4. విశేషణము:-** నామవాచకముల యొక్క స్థితిని విశేషించి వివరించునది అనగా, వస్తువుయొక్క వ్యక్తి యొక్క గుణమును, రంగును, రుచిని, వాసనను గురించి తెలుపునది విశేషనము అంటారు.

ఉదా॥ తెల్లని మల్లెపూవు, పరిమళముగల మల్లెపూవు, సున్నితమైన మల్లెపూవు, సుకుమారముగల మల్లెపూవు, మొదలగునవి.

**5. అవ్యయము:-** వ్యయముకానిది అనగా మార్పుచెందనిది లింగ, వచన, బేదము లేనిది అవ్యయమందుదు.

ఉదా॥ యధా, తధా, ఓహో, ఆహా! భళిభళి, కటకటా, అక్కడ, ఇక్కడ, ఎక్కడ, ఎప్పుడు, మొదలగునవి, పదములతో కూడినది. . . .

**5. లింగములు:-** ఇవి, నామ, సర్వనామ, విశేషణములు, ఏజాతికి, వర్గమునకు సంభదించినవో తెలియజేయునది.

ఇవి (3) మూడు రకములు 1. పులింగం, 2. స్త్రీలింగం, 3. నపుంసకలింగం

**1. పుంలింగం:-** దీనినివి మహద్వాచకము అంటారు, పురుషజాతులను సూచించును.

ఉదా॥ రంగడు, రాముడు, బార్గవి, వాసు, శేషు, దాసు, ఇత్యాదులు.

**2. స్త్రీలింగం:-** దీనిని మహతీవాచకమని కూడ అందురు. స్త్రీ జాతులను సూచిస్తుంది.

ఉదా॥ ద్రౌపతి, ఆవు, గేదె, మేక, ఇత్యాదులు.

**3. నపుంసకలింగం:-** స్త్రీపురుష భేదము తెలియరాని వాటిని గురించి సంభోదించునట్టిది.

ఉదా॥ పుస్తకము, బల్ల, పిల్లి, పులి, ఆవు, అవి, ఇవి, మొదలగునవి

(జంతువులలో ఆడ, మగ, బేదము తెలిసినప్పటికిని వానినన్నింటిని నపుంసకలింగ వాచకంగానే వ్యవహరిందురు)

**వచనములు:-** వచనములు ముఖ్యముగా రెండు (2) విధములు.

1. ఏకవచనము, (2) బహువచనము

**ఏకవచనము:-** ఒకే వస్తువును గాని, ఒకే విషయాన్ని గాని విడిగా సూచించునది.

ఉదా॥ పెన్ను, కన్ను, ఇల్లు, మేడ, కోట, పేట, మొదలగునవి.

**బహువచనము:-** ఒక్కటికి మించిన సంఖ్యాపరంగా వివరించునది.

ఉదా॥ పెన్నులు, కన్నులు ఇండ్లు, మేడలు, కోటలు, పేటలు, ఇత్యాదులు.

**నిత్యబహువచనములు:-** ఎల్లపుడు బహువచనములో వ్యవహరింపబునవి.

ఉదా॥ పాలు, వడ్లు, మొదలగునవి.

**6. కాలములు:-** ఒక పని జరుగు కాలమును గురించి వివరించునది.

ఇవి నాల్గువిధములు:- <u>భూత, వర్తమాన, భవిష్యత్,</u> మరియు తద్దర్మకాలములు అనునవి.

1. **భూతకాలము:-** సీత రాముని పెండ్లియాడెను.
రాముడు అయోధ్య చేరెను
రంగడు ఊరికి వెళ్ళెను.
భూతకాలములోని క్రియ గడిచిన కాలాన్ని సూచిస్తున్నది.

2. **వర్తమానకాలము:-** జరుగుచున్న పని పూర్తి చేయబడకుండ, కొనసాగుచున్నట్లు వివరించును.
ఉదా॥ రమణి పాఠము వ్రాయుచున్నది
రాణి అన్నము తినుచున్నది, మొదలగునవి.

3. **భవిష్యత్కాలము:-** రాబోవు కాలములో జరుగబోవు పనిని గూర్చి తెలుపునట్టిది. భవిష్యత్కాలం అందురు.
ఉదా॥ నేను రేపు ఊరికి వెళ్లగలను
(1999 అక్టోబరులో ఎన్నికలు జరుగగలవు)
నీవు 10వ తరగతిలో నెగ్గగలవు ఇత్యాదులు.

4. **తద్ధర్మకాలము:-** పైమూడు కాలములతో పని లేకుండ నిరంతరం జరుగువట్టిది.
ఉదా॥ నదులు ప్రవహించును, సూర్యుడు ఉదయించును, దీపము వెలుగును, నిప్పుకాలును, మొదలగునవి.

7.**వాక్యములు:-** ఒక భావముతెలుపుటకు కొన్ని అర్థవంతమైన పదముల కలయికయే వాక్యమనబడును.
ఇందులో కర్త, కర్మ, క్రియ అనుమూడు అంగములుండును.

ఉదా॥

| <u>కర్త</u> | <u>కర్మ</u> | <u>క్రియ</u> |
| --- | --- | --- |
| రాముడు | సీతను | చూచెను |
| రంగడు | బంతిని | కొట్టెను |
| గౌరి | పెండ్లికి | వెళ్లినది, ఇత్యాదులు. |

కర్త:- వాక్యములో ప్రధానమైనది జరుగుచున్న పనిని పూర్తి చేయించునది.
కర్మ:- వాక్యములో ద్వితీయమైనది కర్తచేయించు పనిని అనుభవించునది.
క్రియ:- వాక్యములో చివరయుండునది కర్మచేయు పనినే క్రియ అంటారు.
వాక్యములో, కర్తకర్మ లోపించవచ్చునేమో కాని, క్రియలేని వాక్యము ఉండదు.

1. కర్తరి వాక్యప్రయోగము:- అనగా కర్త ప్రథమవిభక్తియందును క్రియా పదము కర్తననుసరించుచు వాక్యమగును.
ఉదా॥ రాము+డు రావణుని చంపెను.
సీసము ఇనుమును కోయును, ఇత్యాదులు.

2. కర్మణీ వాక్యప్రయోగము:- ఇందులో క్రియ, కర్మననుసరించును అనగా, కర్మ ప్రథమా

విభక్తి యందుండును.

ఉదా॥ రామునిచే సంహరింప బడిన రావణుడు.

సీతచే హారము నందిన రాముడు ఇత్యాదులు

3. సంశ్లిష్ట వాక్యప్రయోగము:- ప్రధాన వాక్యముతో ఉపవాక్యములు కలియునప్పుడు వాటి యొక్క క్రియలన్నియు అసమాపక క్రియలుగా మారి చివరన ప్రధాన వాక్యము సమాపకక్రియతో ముగుస్తుంది.

ఉదా॥ రాముడు అన్నము తిన్నాడు - రాముడు అన్నం తిని

రాముడు బడికి వెళ్ళాడు - రాముడు బడికి వెళ్ళి

రాముడు పాఠము చదివాడు - రాముడు పాఠము చదివి

రాముడు అన్నము తిని, బడికి వెళ్ళి పాఠము చదివి ఇంటికి వచ్చాడు.

ఇక్కడ ఉపవాక్యములనబడు పైమూడింటిలో క్రియలు, అసమాపక క్రియలుగా మారి నాల్గవ వాక్యము సమాపక క్రియతో ముగుస్తున్నది. ఇట్లు మార్పు చెందిన మహావాక్యమే సంశ్లిష్ట వాక్యమవబడును.

8. విభక్తిప్రత్యయములు:- 1. వాక్యములో ఒక పదానికి ఇంకొక్క పదముతో అన్వయించునవి ప్రత్యయములు

2. ఒకనామ పదానికి ఇంకొక నామపదముతో గాని, క్రియతోగాని అన్వయము కుదరటానికి కొన్ని ప్రత్యయములను చేరుస్తారు వాటినే విభక్తి ప్రత్యయములు అంటారు.

విభక్తులు:- నామవాచక పదముల చివరన చేరి అర్థవంతమైన వాక్యనిర్మాణమునకు తోడ్పడుఅక్షరములే ప్రత్యయములు ఒక్కొక్క విభక్తికి వేరు, వేరు ప్రత్యయములుండును.

| నామవాచక | ప్రత్యయం | విభక్తులక్రమం | ప్రత్యయములసమూహాము |
|---|---|---|---|
| రాము+ | డు | ప్రథమావిభక్తి | డు,ము,వు,లు, |
| రావణు+ | ని | ద్వితీయావిభక్తి | నిన్,లన్,గూర్చి, గురించి, నన్ |
| వానరుల+ | తోడ | తృతీయావిభక్తి | చేతన్, తోడ,తోడన్,తోన్ |
| సీతవరయుట+ | కొరకు | చతుర్థవిభక్తి | కొరకు, కై |
| విభీషణుని తోడ్పాటు+ | వలన | పంచమీవిభక్తి | వలనన్, కంటెన్పటి, (బట్టి) |
| ఘోరయుద్ధము+ | లో | షష్ఠీవిభక్తి | కి,కిన్,యొక్క,లోన్లోపల |
| రావణువిజంపి+ | నందున | సప్తమీవిభక్తి | అందున్, నన్ |
| లోకులు+ | ఓహో! | సంబోధనావిభక్తి | ఓహో,ఓరీ,ఓయి,ఓసీ,మొదలగునవి. |

నోట్సు :- చివరికాలములోని ప్రత్యయములు ఏగడిలోని వానికి ఆగడిలోనివి సమానార్థములని గ్రహించవలెను.

**9. పురుషములు:-** సర్వనామముల ఉనికిని వివరించునట్టివి. పురుషములు అంటారు. ఇవి (3) విధములు

1. ఉత్తమ, 2. మధ్యమ 3. ప్రథమ పురుషములు.

**1. ఉత్తమ పురుషము:-** నేను, మేము, నాకు, మాకు, (ఏక, బహువచనములు కలసి)

**2. మధ్యమపురుషము:-** ఎదుటివానిని, వారిని, గురించి సంబోధించునట్టిది.

ఉదా॥ నీవు,మీరు,ఇది,అది,ఇవి,(ఏక,బహువచనయుక్తముగా)

**3. ప్రథమపురుషము:-** ఎదుటలేని దానిని, వానిని, గూర్చి తెలుపునది.

ఉదా॥ అతడు, ఆమే,అవి,అది,వాడు మొదలగునవి.

(ఏక, బహువచనములు యుక్తముగా వచ్చును)

**10. సంస్కృత సంధులు:-** సూత్రం=పూర్వ, పర స్వరములకు పరస్వరమేకాదేశ మగుట సంధి నిశ్చయము.

1. సంధి అనగా రెండు పదములు కలియుటచే కలుగుఏకరూపము.

2. రెండు పదముల యొక్క కలయికలో కలుగు మార్పునే సంధియందురు.

పై సూత్రములోని పూర్వపదమనగా మొదటిపదమనియు, పరపదమనగా రెండవ పదమనియు పిలుతురు. రెండు పదములు కలియునప్పుడు మొదటిపదము యొక్క చివరి అక్షరము, రెండవపదము యొక్క మొదటి అక్షరము ఏకమగుటచే సంది కార్యమేర్పడుతుంది.

ఉదా॥ రాముడు+అతడు=రాముడతడు.

సీత+అన్వేషణ=సీతాన్వేషణ మాదిరిగా.

**సంధులు:-** రెండు విధములు 1. సంస్కృత సంధులు, 2. తెలుగు సంధులు,

సంస్కృత సంధులు (6) ఆరు

1. సవర్ణదీర్ఘ సంధి
2. గుణసంది
3. వృద్ధిసంధి
4. యణాదేశసంధి
5. విసర్గసంధి
6. అనునాసిక సంధి అనునవి సంస్కృత సంధులు.

**1. సవర్ణదీర్ఘసంధి:-** సూత్రము= అ,ఇ,ఉ,ఋ లకుఅవే అక్షరములు పరమైన అచట దీర్ఘ సవర్ణమాదేశమగును.సవర్ణమనగా రెండు అచ్చులకు బదులు ఒకే అచ్చు స్థిరమగుట.

**వివరణ:-** అ,ఇ,ఉ,ఋ, అను అచ్చులతో ముగియునట్టి పదములకు అవే అచ్చులు దీర్ఘములైననూ వరుసగా వచ్చినచో రెండవ పదములోని మొదటి అచ్చువెళ్లిపోయి మొదటి పదములోని చివరిఅచ్చుదీర్ఘముగా మారుతుంది.

ఉదా॥ దేవా+అలయము=దేవాలయము=అ+అ+ఆ దీర్ఘమాదేశము

కవి+ఇంద్రుడు=కవీంద్రుడు=ఇ+ఇ=ఈ దీర్ఘమాదేశము.

భాను+ఉదయం=భానూదయం=ఉ+ఉ=ఊ దీర్ఘమాదేశము.

పితృ+ఋణము=పితౄణము=ఋ+ఋ+ౠ దీర్ఘమాదేశము.

**2. గుణసంధి:-** సూత్రము= అకారమునకు ఇకారము పరము కాగా ఏకారమాదేశంబగు ఏ,ఓ,అర్,అనువానిని"గుణములు" అంటారు

"అ" కార అచ్చుతో ముగియు పదానికి "ఇ" కారమను అచ్చుతో ప్రారంభమగు పదము చేరినచో మొదటి పదములోని చివరి అక్షరము ఏ త్వముగా మార్పుజెంది పర పదములోని మొదటి అక్షరమైన "ఇ" కనుమరుగౌను అటులే ఇతరములు.

ఉదా॥ 1. వర+ఇంద్రుడు=వరేంద్రుడు అ+ఇ=ఏ ఆదేశమగును.

2. మధుర+ఊహ= మధురోహ అ+ఉ=ఓ ఆదేశమగును.

3. మహా+ఋషి= మహర్షి ఆ+ఋ=అర్ ఆదేశమగును.

4. పురుష+ఉత్తముడు=పురుషోత్తముడు=అ+ఉ=ఓ ఆదేశమగును.

**3. వృద్ధి సంధి:-** ఐ,ఔ, లను సంస్కృతమున వృద్ధులనియందురు.

సూత్రము:- అ,ఆ,లకు, ఏ,ఓలు పరమైనచో ఐ,ఔలు ఆదేశంబగు "అ"కారముతో ముగియు పదమునకు"ఏ" కారముతో మొదలయ్యే పదము చేరిన పూర్వపదముచివరి యక్షరము "ఐ"త్వముగా మారుతుంది.

ఉదా॥ లోక+ఏక=లోకైక ఆ+ఏ=ఐగా ఆదేశమవుతుంది.

వన+ఔషధం=వనౌషదం=అ+ఓ+ఔగా ఆదేశమవుతుంది.

అదేవిధముగా, అకారముతో ముగియు పదమునకు " ఓ" కారంతో మొదలయ్యే పదము కలిసిన పూర్వపదముచివరి అక్షరం "ఔ" గా మారి పరపదములోని "ఓ"త్వము కనుమరగవుతుంది.

ఉదా॥ మహౌదార్యము=మహ+ఔదార్యము=

వనౌషధి=వన+ఔషధి

**4. యణాదేశసంధి:-** య,ర,ల,వ,లను యణ్ణులందురు.

సూత్రం:- ఇ,ఉ,ఋ,ల కు సవర్ణములుకాని అచ్చులు పరమైన క్రమముగా, య,వ,ర,లు ఆదేశంబగును.

ఉదా॥ దధి+అన్నము=దధ్యన్నము=ఇ+అ=య వచ్చును.

గురు+ఆదేశము=గుర్వాదేశము=ఉ+అ=వ వచ్చును.

మాతృ+అర్చన=మాత్రార్చన=ఋ+అ=ర వచ్చును.

అతి+అంతము=అత్యంతము=ఇ+అ=య వచ్చును.

**5. అనునాసిక సంధి:-** ఙ,ఞ,ణ,న,మ అను వర్గపంచమాక్షరాలను అనునాసికములని అంటారు.

సూత్రం=పదముచివరనున్న,క,చ,ట,త,ప,లకు న,మ, అను నాసికములు వికల్పము గానగు

పురుషముగు,చ,ట,త,ప,యను వర్గ ప్రథమాక్షరములకు, అనునాసికములు పరమైనచో వర్గ అంతిమాక్షరములు ఆదేశమగును

ఉదా॥ వాక్+మయము=వాఙ్మయము=క్+మ=ఙ్మ

చిత్+మయము=చిన్మయము=త+మ=జ

షన్+మసములు=షణ్మాసములు=ణ్+మ=జ

**విసర్గసంధి:-** అరసున్న , సున్న, విసర్గ అనువానిని "విసర్గ"లందురు

సూత్రం:- విసర్గలకు, (క,చ,ట,త,ప) శ,ష,స,లు పరముగా వచ్చిన, సకార, శకారాలు ఆదేశమగును.

ఉదా॥ తపః+సిద్ధి=తపస్సిద్ధి

ధనుః+బాణము=దనుర్బాణం

వచః+శుద్ధి=వచశ్శుద్ధి.

"క" "ప" కారము పరమైనచో విసర్గలు మారవు

**ఉదా॥** మనః+కమలము=మనఃకమలము

తపః+ఫలము=తపఃఫలము, ఇత్యాదులు.

**11. తెలుగు సంధులు:-** సూత్రం= పూర్వపరస్వరంబులకు "పరస్వరం" ఏకాదేశమగుల సంధియనబడును.

తెలుగు పదజాలములన్నియు అచ్చులతో అంత మగును అందువలననే తెలుగును 'అజంత' భాషలని అన్నారు.

అందువలన తెలుగుసంధులన్నిటిని "అచ్సంధులు" అనిపిలుతురు

ఉదా॥ పుస్తక+ము "ము" అమయక్షరమునందు "ఉ" యనుఅచ్చుగోచరమగుచున్నది.

అలాగే రంగ+డు "డుకారములో" "ఉ"కారమున్నది.

ఇటులే ప్రతి పదాంతమునందు అచ్చు గోచరమగును.

అచ్చులలో ఆకార, ఇకార,ఉకార, సంధులు ముఖ్యమైనవి.

పూర్వపదాలచివర యున్న అచ్చునకు ఉత్తరపరములలోని అచ్చు కలసినప్పుడు

ఉత్తర పదములోని అచ్చు మాత్రమే రెంటి స్థానములో మిగులుతుంది. దీనినే ఆదేశం అంటారు.

ఉదా॥ దుర్గ+ఆరాధన= దుర్గారాధన. . . ఆకార

కవి+ఇంద్రుడు= కవీంద్రుడు. . . ఇకార

భాను+ఉదయం= భానూదయం . . . ఉకార ఇత్యాదులు.

అచ్చులవే: అ నుండి ఔ వరకు స్వరములు అందురు. ఇవి కూడ రెండు విధములు విభజింపబడినవి

**1. హ్రస్వములు** = అ,ఇ,ఉ,ఋ,ఎ,ఒ,లు

**2. దీర్ఘములు** = ఆ,ఈ,ఊ,ౠ,ఏ,ఐ,ఓ,ఔ,లు

**ఆకారసంధి:-** అత్తునకు సంధి బహుళము

వివరణ:- హ్రస్వమైన అకారమునకు అచ్చుపరమైనపుడు సంధి బహుళముగా వచ్చునవిభావము. అకారముతో ముగియు పదముతో ఏదేని అచ్చుతో మొదలగుపదము చేరినచో కొన్ని పార్లు "సంధి" జరుగవచ్చును జరుగకపోవచ్చును (దీనినే బహుళము అందురు.

ఉదా॥ పుట్టిన+ఊరు=పుట్టినూరు=పుట్టినయూరు (సంధిలేదు)

ఏమి+అంటివి=ఏమంటివి=ఏమియంటివి (సంధిలేదు)

అది+ఏమి?=అదేమి?=అదియేమి? (సంధిలేదు), ఇత్యాదులు.

ఇకారసంధి:- క్రియాపదములందు "ఇత్తు"నకు సంధి వైకల్పికం (రావచ్చు-రాకపోవచ్చు. (తెలుగువ దీర్ఘములైన అచ్చులకు సంధిరాదు)

ఉదా:- ఇక్కడ క్రియాపదము : వచ్చిరి+అపుడు=వచ్చిరపుడు, వచ్చిరియపుడు నడిచిరి+అందరు=నడిచిరందరు నడిచరియందరు.

ఉకారసంధి:- సూత్రం:- ఉత్తునకు అచ్చుపరమైన సంధి నిశ్చయము

ఉదా॥ రాముడు+అతడు=రాముడతడు

మనము+అందరం=మనమందరం

వీరు+ఎక్కడ=వీరెక్కడ, ఇత్యాదులు.

యడాగమసంధి:- సూత్రం:- సంధి లేనిచోట స్వరంబుకంటె పరంబయిన స్వరంబునకు యడాగమంబగు ఇందులో సంధిరాకున్నను పరపదము మారుచుండుమ.

ఉదా॥ చేరి+అడిగేను=చేరి యడిగేను అక్కడ "య" ఆదేశమయినది.

చూచి+ఏగేను=చూచియేగెను ఇక్కడ "యే" ఆదేశమయినది.

టుగాగమసంధి:- సూత్రం:- కర్మదారయంబు నందుత్తునకచ్చు పరంబగునప్పుడు టుగాగమామగును.

సూత్రం:- 2,కర్మదారయంబునందు పేర్వాదిశబ్దములకచ్చుపరంబయినచో టుగాగమంబు విభాషనగు.

ఉదా॥ కటుకు+అమ్మ=కటుకుటమ్మ టకారమాదేశంబు

చిగురు+ఆకు=చిగురుటాకు టకారమాదేశంబు

నిలువు+అద్దము=నిలువుటద్దము టకారమాదేశంబు

పెంకు+ఇల్లు=పెంకుటిల్లు టకారమాదేశంబు, ఇత్యాదులు.

రుగాగమసంధి:- సూత్రం:- కర్మదారయమునందు పేదాధి శబ్దములకు "ఆలు" శబ్దము పరమైన రుగాగమంబగును.

ఇక్కడ, పేదాదులు అనగా, పేద. బీద,ముద్ద,బాలెంత, జవ, మనమ, గొడ్డ, ముత్యయిదవ,మొదలగునవి.

ఉదా॥ పేద+ఆలు=పేదరాలు

జవ+ఆలు=జవరాలు

గుణవంత+ఆలు=గుణవంతురాలు

గొడ్డు+ఆలు=గొడ్రాలు

బాలెంత+ఆలు=బాలెంతరాలు

ముత్తైదవ+ఆలు=ముత్తైదవరాలు, ఇత్యాదులు.

**త్రికసంధి:-** ఆ,ఈ,ఏ,అను స్వరనామములకు త్రికములని పేరు

సూత్రం:- త్రికముమీది అసంయుక్తమగు హల్లునకు ద్విత్వము బహుళముగా వచ్చిన త్రికసంధియగును.

ఉదా॥ ఈ+తెఆగు=ఈత్తెఆగు

ఈ+మగువ=ఈమ్మగువ

ఈ+పులుగు=ఈప్పులుగు

<u>నోటు:-</u> అచ్చులలో ఋకారం, హల్లులలో శ,ష,స,హ,ర, యనెడి వర్ణములు సరముగా మన్నప్పుడు త్రికసంధి రాదు.

ఉదా॥ ఆ+రాజా

ఈ+ఋషి

ఆ+సరుకు

ఈ+హారము, ఇత్యాదులు సంధికి అస్కారమివ్వవు.

**దుగాగమసంధి:-** సూత్రం:- నీ,నా,తన, అను పదంబులకు వేరొక పదంబు పరంబయిన దుగాగమంబు ఆదేశమగును.

ఉదా॥ నీ+చెలిమి=నీదుచెలిమి

నా+భాగ్యము=నాదుభాగ్యము

తన+రాత=తనదురాత, ఇత్యాదులు.

**పురుషములు:-** అనగా సర్వనామ ప్రక్రియలు=నేను, నీవు, అతడు, ఆమె.

**12. సమాసములు:-** 1. సూత్రం=సమర్ధములగు రెండు పదము లేకమగుట సమాసమగును.

2. స్వంత అర్ధమును కలిగిన పదములు ఏకమగుటను సమాసమందురు.

ఉదా॥ బంగారపు గొలుసు ఇందులో బంగారం, గొలుసు అను రెండు పదములున్నవి బంగారం లోహమును గొలుసు ఆకృతిని తెలుపుచున్నవి, కావున రెండు కలిసి బంగారు గోలుసు అను ఒకే వస్తువును సూచించుచున్నది.

**కర్మదారయ:-** మనగా రెండుపదములయొక్క భావము ఒకే పదమునందు కేంద్రీకరింపబడియుండునది.

**పురుషము:-** అనగా సర్వనామము యొక్క ఉనికిని చాటునది

ఉదా॥ నాకు, నీకు, అతనికి, అమెకు, మాకు, మీకు, వారికి మొదలగునవి.

**ఆగమము:-** అనగా (వర్ణాధిక్యము) మరియొక్క అక్షరము వచ్చిచేరుట.

**ఆదేశము:-** అనగా సంధి జరుగునపుడు ఉన్నయక్షరము పోయి కొత్తయక్షరము వచ్చిచేరుట.

**విగ్రహవాక్యము:-** అనగా సమాసముయొక్క అర్థమును వివరించునది.

సమాసములను విడదీసి వానిమధ్యగల విభక్తి ప్రత్యయములను వివరించువది విగ్రహము.

| ఉదా॥ | సమాసము | విగ్రహవాక్యము |
|---|---|---|
| | రాజపూజితుడు | రాజుచేత పూజితుడు |
| | జ్ఞానానందము | జ్ఞానమువలన ఆనందము |
| | దేవపూజ | దేవుని కొరకు పూజ |
| | సత్యావాక్యము | సత్యమైనవాక్యము మొదలగునవి. |

సమాసమును విడదీసినచో మొదటి పదమును పూర్వపదమనియు, రెండవ పదమును ఉత్తరపదమనియు. పైరెండు పూర్వోత్తర పదములు రెండు కలిసి, సమగ్రపదసమాసమని వ్యవహరింపబడును.

ఇక, అర్థములను బట్టి సమాసములు(5) ఐదు భాగములుగా విభజింపబడినవి.

1. తత్పురుష సమాసము
2. కర్మధారయ సమాసము
3. ద్వంద్వ సమాసము
4. ద్విగు సమాసము
5. బహువ్రీహి సమాసము

1. తత్పురుష సమాసము:- ఉత్తరపద ప్రాధాన్యము గలది.

1. సమాసములోని రెండు పదముల యొక్క భావము (ఉత్తర) రెండవపదము పైననే ఆధారపడియుండును.

2. సమాసములో పూర్వపదము యొక్క విభక్తిలోపించినను ఆ విభక్తి పేరుతోనే ఫలానా తత్పురుషమని పిలువబడును తత్పురుషములు (విభక్తులు) (7) రకములని చెప్పబడినవి అవియే ఇవి.

| తత్పురుషము | సమాసము | విగ్రహవాక్యము | సమాసనామము |
|---|---|---|---|
| 1. ద్వితీయ తత్పురుషము | విద్యార్థి | విద్య ను ఆర్జించువాడు | ద్వితీయ తత్పురుషము |
| 2. తృతీయ తత్పురుషము | లోకవంచితుడు | లోకము చే వంచితుడు | తృతీయ తత్పురుషము |
| 3. చతుర్థీ తత్పురుషము | విశ్వశాంతి | విశ్వము కొరకు శాంతి | చతుర్థీ తత్పురుషము |
| 4. పంచమీ తత్పురుషము | దొంగభయం | దొంగ వలన భయం | పంచమీ తత్పురుషము |
| 5. షష్ఠీ తత్పురుషము | ధర్మమార్గము | ధర్మము యొక్క మార్గం | షష్ఠీ తత్పురుషము |
| 6. సప్తమీ తత్పురుషము | మాట నేర్పరి | మాట యందు నేర్పరి | సప్తమీ తత్పురుషము |

**నోటు:-** ప్రథమావిభక్తి ప్రత్యయములో - విగ్రహవాక్యమును వివరింపవీలు కానందున విత్యజించబడినది గమనింపుడు.

ఒక్కొక్క విభక్తితో ఒక్కొక్క తత్పురుషము ఏర్పడుతుంది.

ఉదా॥ విద్యాధికుడు అను సమాసమును విడదీసి అర్థయుక్తముగా చెప్పవలెనన్న విద్య చేత అధికుడు అని చెప్పబడుతుంది.

ఇక్కడ చేన్, చేతన్, తోన్, తోడన్, అనునవి తృతీయ తత్పురుషములుగా పేర్కొనుట జరుగును. ఇట్లే ఇతర తత్పురుషములకు విగ్రహ వాక్యములను చేర్చవచ్చును.

**2. కర్మదారయ సమాసము** సూత్రం=విశేషణ విశేష్యముల సమాసమే కర్మదారయం అనగా, విశేషణ విశేష్యములు చక్కగా కలిసి పోవునది కర్మధారయ మందురు.

ఉదా॥ మధుర ఫలములు ఇక్కడ మధురము ఫలములు రెంటి యొక్క ధర్మము ఫలమునందే ఇమిడియున్నది. అట్లే, రెండు పదముల భావము కూడ ఒకే పదమునందు కానవగును.

**కర్మదారయసమాసములు (8) ఎనిమిది రకములు**

మొదట కర్మదారయమునకుపకరించువానిని గురించి తెలుసుకుందాము.

1. విశేష్యము = అనగా నామవాచక సంబంధమైనది.
2. విశేషణము = అనగా నామవాచకమును విశేసించి చెప్పునది. అనగా విశేష్యము యొక్క రంగు, రుచి, వాసన, గుణము మొదలగు వానిని వివరించునది.
3. ఉపమానము = అనగా విశేష్యమును ఏ వస్తువుతో పోల్చుదుమో దానినే ఉపమానమందురు.
4. ఉపమేయము = అనగా దేనినైతే (నామవాచకము) పోలుస్తామో దానినే ఉపమేయమందురు.
5. సాధర్మము = అనగా ఉపమానము యొక్క ధర్మము ఉపమేయమునందు చక్కగా అమరినదైయుండుట.
   ఉదా॥ జలజాక్షి - అనగా కమలముల వంటి అందమైన కన్నులు కలది. ఇందులో
   అక్షి = కన్నులు అనునది ఉపమేయము
   జలజము = కమలము అనునది ఉపమానముగా తీసుకోబడినది.
   అందము = సొగసు రెంటి యందు సాదర్మము ఉన్నదని అర్థం.

ఇక కర్మధారయముల(8) గురించి:

**1. విశేషణ పూర్వపద కర్మదారయ సమాసము:-** ఇందులో విశేషణం పూర్వపదంగా, విశేష్యము ఉత్తరపదంగా ఏర్పడు వాక్యము

ఉదా॥ సుందర మందిరము, మధుర పదార్థము, నిత్య సత్యము ఇత్యాదులు.

**2. విశేషణోత్తర పద కర్మదారయ సమాసము:-** ఇందులో విశేష్యము పూర్వపదమై, విశేషణము ఉత్తరపదంగా ఏర్పడు వాక్యము.

ఉదా॥ కురువృద్ధులు, పురుషోత్తముడు, కపోతవృద్ధము మొదలగునవి.

**3. విశేషణోభయ పదకర్మదారయ సమాసము:-** ఇందులో పూర్వ+ఉత్తర పదములు రెండు కూడ విశేషణములైయుండును.

ఉదా॥ మృధుమధురం, శాంత గంభీర్యము, ధీరోదాత్తుడు మొదలగునవి.

4. ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసము:- ఇందులో ఉపమానము పూర్వపదమై ఉపమేయము ఉత్తర పదముగా ఏర్పడునది.

ఉదా॥ ఇందుసుందరుడు, చిగురుమోవి, మను చెక్కిలి మొదలగునవి.

5. ఉపమానోత్తర పదకర్మధారయ సమాసము:- ఇందులో ఉపమానము ఉత్తరపదముగా ఉపమేయము పూర్వపదముగా ఏర్పడునట్టిది.

ఉదా॥ చరణకమలములు = కమలములవంటి చరణములు

ముఖ పద్మము = పద్మము వంటి ముఖము

తనూవల్లరి = తీగవంటి శరీరముగలది ఇత్యాదులు

6. (ఆరోపణ) అవధారణ పూర్వపదకర్మధారయ సమాసము:- దీనినే రూపక సమాసమందురు ఒక వస్తువు యొక్క ధర్మము వేరొక వస్తువునందు ఆరోపించునది.

ఉదా॥ విద్యా ధనము = విద్య యందు ధనము యొక్క విలువను, సంసార సాగరం = సంసారమందు సాగరగంభీర్యతను ఆరోపింపబడింది. ఇందులో మొదటి పదము "అనెడి" అనుబంధముతో రెండవ నందు సంబంధము కల్గియున్నది.

7. సంభావన పూర్వపదకర్మధారయ సమాసము:- ఇందులో సంజ్ఞా పదము మొదటయుండును, సామాన్య పదము తదుపరి యుండును. ఉదా॥ డిల్లీనగరం, గంగానది, రామాయణ కావ్యం, హిందూ మహాసముద్రం మొదలగునవి.

8. మధ్యమపదలోప కర్మధారయ సమాసము:- ఇందులో వాక్యము మధ్యపదము లోపించును.

ఉదా॥ గాజులసెట్టి = గాజులు పెట్టు సెట్టి "పెట్టు" పదలోపము

బడిపంతులు = బడిలో పాఠము చెప్పు పంతులు "చెప్పు" జరిగింది.

3. ద్వంద్వ సమాసము :- ఇందు ద్విపద ద్వంద్వం, బహుపద ద్వంద్వం అని రెండు విధములు

1. ద్విపద ద్వంద్వం:- ఈ సమాసములో రెండు పదములూ సమప్రాధాన్యత కలిగియుండును.

ఉదా॥ తల్లిదండ్రులు, అన్నదమ్ములు, బాలబాలికలు, గురుశిష్యులు, చదువు సాములు, రాకపోకలు మొదలగునవి.

2. బహుపద ద్వంద్వ సమాసము:- రెంటికి మించిన పదములతో కూడినది

ఉదా॥ దర్మార్థకామములు, రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు మొదలగునవి.

4. ద్విగు సమాసము:- సంఖ్యావాచకం పూర్వపదముగా గల కర్మధారయమే ద్విగు సమాసమందురు.

ఉదా॥ ముల్లోకములు - మూడు లోకములు, నల్దిక్కులు - నాలుగు దిక్కులు

పంచపాండవులు - ఐదుగురు పాండవులు , నవరత్నములు - తొమ్మిది రత్నములు మొ॥

5. బహువ్రీహి సమాసము:- ఈ సమాసమునందు రెండు పదములు కలిసి ఒక ప్రత్యేక అర్థాన్ని ఇస్తుంది. ఈ సమాసమున కలది, కలవాడు, అనిగాని, లేనివాడు లేనిది, అనిగాని అర్థము స్ఫురించుపదములతో

కూడియుండునది "బహువ్రీహి" అవుతుంది.

ఉదా॥ పీతాంబరుడు = పచ్చని వస్త్రము ధరించువాడు

ముక్కంటి = మూడు కన్నులు గలవాడ

అనంతుడు = అంతము లేనివాడు

అబల= బలములేనిది

నిర్భయుడు = భయములేనివాడు

పద్మాక్షి = పద్మములవంటి కన్నులు కలది. మొదలగునవి.

# ఛందస్సు

లయబద్ధముగా వ్రాయు కవితలను, గేయములనియు పద్యములనియు అందురు.

ప్రత్యేకించి పద్యరచనా విధానమును తెలియజేయు శాస్త్రమునే ఛందస్సు అని వ్యవహరింతురు.

తెలుగులోని పద్యములు, మాత్రాగణబద్ధముగా, యతి,ప్రాసాను నియమంగా లోకప్రసిద్ధములు.

**పద్యములు:-** ముఖ్యముగా (3) రకములుగా పరిచితములు

1. వృత్తములు, 2. జాతులు, 3. ఉపజాతులు.

**1. వృత్తములు:-** ఉత్పలమాల, చంపకమాల, శార్దులము, మత్తేభవిక్రీదితం, మత్తకోకిల స్రగ్దర మొదలగునవి.

**2. జాతులు:-** కందం, తరువోజ, మద్యక్కరలు

**3. ఉపజాతులు:-** ఆటవెలది, తేటగీతి, సీసము, ద్విపద మొదలగునవి.

## 14. పద్యలక్షణము:-

పద్యములు నాలుగుపాదములు కలిగియుండును.

పద్యములలో-దీర్ఘపాదములు, పొట్టిపాదములు మిళితమైయుండును,

పద్యము గణముల కూర్పుతో ఏర్పడును.

గణములు, గురు,లఘువులతో కలసి ఉంటాయి.

**లఘువు:-** దీని గుర్తు । - అనగా 1మాత్రాకాలము (చిటికె వెయువంత కాలములో ఉచ్చరించునది.)

**గురువు:-** దీని గుర్తు ∪,అనగా 2మాత్రల కాలము (రెండు చిటికెలు వెయునంత కాలములో ఉచ్చరించునది.)

## గురువుల లక్షణాలు వాని, గుర్తింపువిధము

| | |
|---|---|
| 1. ఆ,ఈ,ఊ,ఋూ,ఏ,ఐ,ఓ,ఔ | దీర్ఘాలు (అచ్చులు) |
| 2. కా,కీ,కూ,కే,కై,కో,కౌ | దీర్ఘాలు (హల్లులు) |
| 3. పై హల్లులు వలె మిగతావి గా,గీ, గూ,గే లు | అక్షర క్రమములో అన్ని హల్లులు దీర్ఘాములు |
| 4. పంట,వంట,తంట,గంట,మంట | పూర్ణబిందువుగల అన్ని అచ్చులు+హల్లులు |
| 5. దుఃఖము-తపఃబు | విసర్గకల్గిన అక్షరాలు |

6. పుస్తకము-పుస్-తకము=ఊదిపలుకునవి

7. పు=గురువు, స్త,సంయుక్తాక్షరం లఘువు

8. గురువుల్, మునుల్ వానిన్, చేతన్

సయుక్త, ద్విత్ అక్షరాలకు ఎడమన, అనగా దావల యున్న హ్రస్వములు గురువులగుమ పొల్లుతో కూడినవి. పుల్,మల్,నివ్,తన్,మొ॥గునవి.

## లఘువుల, లక్షణములు వాని గుర్తింపు

| | | |
|---|---|---|
| 1. | అ,ఇ,ఉ,ఋ,ఎ,ఒ | హ్రస్వాలు-అచ్చులు |
| 2. | క,కి,కు,కొ,కై | హ్రస్వాలు-హల్లులు |
| 3. | అక్షరక్రమములో మిగతా హల్లులకు కూడ వర్తించును | హ్రస్వాలు,హల్లులు |
| 4. | కృ,గృ,చృ,జృ,తృ,దృ,సృ,మృ,ఇత్యాదులు | పట్టు సుడిగల పొట్టి అక్షరాలు |
| 5. | న్య,త్క,ద్న,ర్ల,ర్య,ల్మ,ర్వ,మొదలగునవి | సంయుక్షక్షరాలు పొట్టివి (దీర్ఘములుకానివి) |
| 6. | మ్మ,క్క,న్న,త్త,గ్గ,జ్జ,ప్ప, మొదలగునవి | ద్విత్వాక్షరాలు,పొట్టివి. |

**నోటు:-** "ఋ"కారముతో కూడిన అక్షరము ఎప్పటికిని సంయుక్తాక్షరం కానేరదు.

ఉదా॥ అదృష్టము ఇక్కడ "దృ" సంయుక్తాక్షరం కాదు

ఎందుకనగా సంయుక్తాక్షరమునకు మొదటనున్న అక్షరము "అ" ఊదివలుకుటలేదు, అలాగే మరియొకటి వాని శ్వాస ఆడంటలేదు ఈవాక్యములో "శ్వా" కు మొదటనున్న "ని" ఊదిపలుకబడుటలేదు కాబట్టి "ని" గురువుకాదు.

## గణాలవివరణ:-

గురువును "గ" అనియు లఘువును "ల" అందురు రెండు అక్షరాల గణాలు నాలుగు (U)

| | | | |
|---|---|---|---|
| 1. వగణం, లగం | IU | రమా | ఒకలఘువు ఒక గురువు |
| 2. లలం | II | అల | లఘువు+లఘువు |
| 3. గలం లేక హగణమ | UI | రాజు | గురువు-లఘువు |
| 4. గగం | UU | రోజా | గురువు+గురువు |

**గణనిర్ణయ మాత్రం:** య,మా,తా,రా,జ,భా,న,స,వ,హం.

### మూడక్షరాల గణములు(8) ఎనిమిది

| | | |
|---|---|---|
| IUU | యగణము | మురారీ |
| UUU | మగణము | రాజాజీ |
| UUI | తగణము | గోవింద |
| UIU | రగణము | రాఘవా |
| IUI | జగణము | సితార |
| UII | భగణము | శ్రీలత |

| | | |
|---|---|---|
| III | నగణము | వరుడు |
| IIU | సగణము | సుమతీ |

4. నాలుగు అక్షరాల గణాలు-మూడు(3)

| | | |
|---|---|---|
| 1. నలం-నగణంమీద లఘుము | III+I | అమరులు |
| 2. నగం-నగణంమీద గురువు | III+U | కురుబలం |
| 3. సలం-సగణం మీద లఘువు | IIU+I | వనజాక్షి |

**సూర్యగణములు(2) రెండు:-** దీనినే ఇన గణములు అని కూడ పిలుతురు

| | | | |
|---|---|---|---|
| 1. | నగణం | III | నలుడు |
| 2. | గలం లేక హగణం | UI | నాతి |

**ఇంద్రగణములు (6) ఆరు:**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | నలం | - | నగణం మీద లఘువు | - | IIII | అసురులు |
| 2. | నగం | - | నగణం మీద గురువు | - | IIIU | సరసిజం |
| 3. | సలం | - | సగణం మీద లఘువు | - | IIUI | వనజాక్షి |
| 4. | భగణం | - | ఆదిగురువు | - | UII | పావని |
| 5. | రగణం | - | మధ్యలఘువు | - | UIU | జానకీ |
| 6. | తగణం | - | అంత్యలఘువు | - | UUI | రారాజా |

పైన వివరించిన గురు,లఘువులతో గణవిభజన చేయు సూత్రము

## సూత్రం: య. మ. తా. రా. జ. భా. న. స. వ. హం

పై సూత్రాలనుసారం ప్రతిపద్య పాదములోని అక్షరములను, మూడేసి,చొప్పున సమితులుగా విభజన చేసి, ఆయా సమితులలోని మొదటి అక్షరాన్ని గణాక్షరముగా గుర్తింపవలయును.

ఉదా॥ యగణం-IUU, కావాలంటే, సూత్రంలోని **య,మా,తా,** లను ఒక గణముగా లేక, సమితిగా గుర్తించి/అల్లిక్ ఇస్తూ మిగతా గణాలను పైమాదిరిగా చేయాలి.

<u>15. యతి-ప్రాసలు:</u>

యతి:- అనగా, పద్యపాదములోని మొదటి అక్షరమునకును అదే పాదములోని నియమిత స్థానములోని వర్ణమును యతి యందరు.

మొదటిది అచ్చు అయితె, అచ్చు, హల్లు, అయినచో హల్లుగా నుంచుటను యతి అని అంటారు

ఉదా॥ తల్లి దండ్రి మీద దయలేని పుత్రుండు

పై పద్యపాదములోని "త" మొదటి అక్షరానికి, నాల్గవ గణము మొదటి యక్షరం "ద" యతి స్థానము అని నిర్ణయము,. అలాగే వివిధ పద్యపాదము లందు నియమిత స్థానము యతి స్థానముగా గుర్తించుట జరుగును.

యతిమైత్రిగల అచ్చులు:- 1. అ, ఆ, ఐ, ఔ, లు

2. ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ

3. ఉ, ఊ, ఒ, ఓ

యతి మైత్రిగల హల్లులు 1. క, ఖ, గ, ఘ

2. చ, ఛ, జ, ఝ, శ, ష, స

3. ట, ఠ, డ, ఢ

4. త, థ, ద, ధ

5. ప, ఫ, బ, భ, వ

6. ర, ఱ, ల, ళ

7. యం, హా, లకు యతి మైత్రి గలవిగానున్నవి సంయుక్తాక్షరములో మైత్రి యతి కలసినప్పుడు దానిలో గల ఏ (సంయుక్తములో) అక్షరముతో నైనను యతిని నిలుపవచ్చును.

నోటు:- అచ్చులతో మైత్రి అచ్చులతోను హల్లుతో మొదలైన యతికి హల్లుతోనే యతిని గూర్చవలయును.

## ప్రాస:

పద్యపాదములలోని రెండవ యక్షరమును ప్రాసయందురు

ప్రాసలో హల్లు సమంగా వుంటె చాలును, ప్రాసఅనునది వృత్త మరియు జాతి పద్యములందును, సాధారణ ద్విపదయందును కానవగును.

ఉదా॥ బిడ్డల గని పాలిచ్చెడు

దొడ్డ తనంబున్న పుల్గు దొరసావివినా

కడ్డు పడదిగిన వేలుపు

గిడ్డి వినామనవి నాలకింపుము పులుగా

పై పద్యములో ప్రతి పాదములోని రెండవ యక్షరము (ఏకాక్షరమైయున్నది) డ కారము ప్రాసగా ఉన్నది.

**ప్రాసయతి :-** ఇది కేవలము ఉపజాతి పద్యములందు వాడదగును. యతిమైత్రికి బదులుగా ప్రాస మైత్రిని వాడితే దానినే ప్రాస యతి అంటారు. అనగా నిర్ధారిత యతి స్థానము తదుపరి స్థానములో ప్రాసాక్షరాన్ని యుంచుట.

ఉదా॥ పక్షిరాజ పుత్ర రాక్షస తృణదాత్ర

దంతి భయవిరామ శాంతి దామ

పై పద్యపాదములో ప్రాస యతిని గమనింపుడు.

## 14. గణముల వారీగా పద్య పరిచయము

| పద్యము పేరు | గణాక్షరములు | యతి స్థానములు |
|---|---|---|
| ఉత్పలమాల | భ,ర,న,భ,భ,ర,వ | 10వ యక్షరము |
| చంపకమాల | న,జ,భ,జ,జ,జ,ర | 11వ యక్షరము |
| శార్దూలం | మ,స,జ,స,త,త,గ | 13వ యక్షరము |
| మత్తేభం | స,భ,ర,న,మ,య,వ | 14వ యక్షరము |
| మత్తకోకిల | ర,స,జ,జ,జ,ర | 11వ యక్షరము |
| తరలం | న,భ,ర,స,జ,జ,గ | 12వ యక్షరము |

### 4. పద్యములు వాటి లక్షణాలు

**1. ఉత్పలమాల:-** 1. ఇందులో నాలుగు పాదములుండును. 2. ప్రతి పాదానికి భ,ర,న,భ,భ,ర,వ అను గణాలుండును. 3. యతిస్థానము 10వ యక్షరము చెల్లుతుంది. 4. ప్రాస నియమం ఉంటుంది. 5. ప్రతి పాదములో 20 అక్షరములుండును. 6. పాదమొదలు చివరి యక్షరములు గురువులే.

| భ | ర | న | భ | భ | ర | వ |
|---|---|---|---|---|---|---|
| U I I | U I U | I I I | U I I | U I I | U I U | I U |

ఉదా॥ నా విని సత్యభామ వదనంబువలే నగ వంకురింపనే

**2. చంపకమాల:** ఇందులో నాలుగా పాదములుండును. 2. ప్రతి పాదానికి వరుసగా న,జ,భ,జ,జ,జ,ర గణాలుంటాయి. 3. యతిస్థానము 11వ యక్షరమై చెల్లును. 4. ప్రాస నియమం ఉండుమ. 5. ప్రతి పాదములో 21 అక్షరములుండుమ. 6. పాదము చివరి యక్షరము గురువు.

ఉదా॥ వలిమల యట్లువాడు తలవాక ధరించిన పూవు గుత్తివే

**17. వృత్తముల మార్పు** చంపకమాల పద్యమును ఉత్పలమాల పద్యముగా మార్పుజేసిన తీరును పరిశీలింపుడు.

1. **చంపక :** చెలువుగ బుష్ప వృష్టి గురిసెన్ సహదేవుపయిన్ దివంబున్

2. **ఉత్పల:** చెల్వుగ బుష్ప వృష్టి గురిసెన్ సహదేవుపయిన్ దివంబున్

పై పద్యపాదములలోని మొదటి గణములు మార్పుజేసిన చాలు పద్యము తారుమారు అగును. చెలువు అను గణము చెల్వు అని మార్చినచో గణములు వానంతలు అవే మారిపోవుమ. గమనింపుడు. చంపక ఉత్పలమాల మాదిరిగానే శార్దూల, మత్తేభముల యొక్క పాదమొదటి గణమార్పు చేసినచో పద్యములు తారుమారు అగుమ.

3. **శార్దూలం:-** 1 ఇందులో నాలుగు పాదములు వుండును. 2. ప్రతి పాదానికి మ,స,జ,స,త,త,గ గణాలుంటాయి. 3. యతి స్థానము 13వ యక్షరము చెల్లుతుంది. 4. ప్రాస నియమము ఉంటుంది. 5. ప్రతి పాదములో 19 అక్షరాలు ఉంటాయి.

| | UUU | IIU | IUI | IIU | UII | UUI | U |
|---|---|---|---|---|---|---|---|
| ఉదా॥ | తల్లీ ని | న్ను దలం | చి పుస్త | కము చే | తన్‌బూని | తిన్ నీవు | నా |

4. **మత్తేభం:** 1. ఇందులోను నాలుగు పాదాలు ఉండును. 2. ప్రతి పాదములో స,భ,ర,న,మ,య,వ గణాలుంటాయి. 3. యతిస్థానము 14వ యక్షరమౌతుంది. 4. ప్రాస నియమం ఉండును. 5. ప్రతి పాదమున 20 యక్షరాలు వుండును.

| | IIU | UII | UIU | III | UUU | IUU | IU |
|---|---|---|---|---|---|---|---|
| ఉదా॥ | గరుడ | స్కందము | మీదవి | ల్పి నిలి | పెంగౌతూ | హాలంబిం | తికిన్ |

5. **మత్తకోకిల:** 1. దీనికి కూడ నాలుగు పాదములుండును. 2. ప్రతి పాదములో ర,స,జ,జ,భ,ర, గణములుండును. 3. పాదమున 11వ యక్షరము యతి చెల్లుతుంది. ప్రాస నియమం ఉన్నది.

| | UIU | IIU | IUI | IUI | UII | UIU |
|---|---|---|---|---|---|---|
| పద్యపాద విభజన : | పాయినీ | ప్రతి రో | జా గొల్పి | న సంక | టంబులు | బాయవే |

**జాతిపద్యములు :** ఇది మాత్రా గణబద్ధమైనది (చతుర్మాత్రాగణములు గల్గి యతి ప్రాసములతో కూడినవి జాతులు.

**కందం :-** అనగా ప్రతి గణములో (4) నాలుగు మాత్రలు ఉండును. మాత్ర అనగా చెటికవేయునంత కాలములో ఉచ్చరింపబడునది ప్రతి గణము 4 మాత్రలు కలిగియుండును. ఇక్కడ గురువు సమానం. 2 మాత్రలు. లఘువు సమానము 1 మాత్రగా పరిగణింపబడుతుంది. ఒక్క గణము కావాలంటె 2 గురువులు గాని, 4 లఘువులు కాని అవసరము లేదా ఒక గురువు రెండు లఘువులు అయిన సరిపోవును.

గణ నిర్దేశము : UU గగము
UII భ గణము
IUI జ గణము
IIU స గణము
IIII నలము

ఈ 5 గణములు మాత్రమే సందర్భానుసారముగా పలుమార్లు అయిన వాడవచ్చును.

(1) కంద పద్యములో 4 పాదములుండును. (2) 1,3 పాదములందు మూడేసి గణములు (3) 2,4 పాదములందు ఐదేసి గణములుండును. (4) మొదటి పాద లక్షణములు 3వ పాదమునందును రెండవ పాద లక్షణములు 4వ పాదమున యుండును. (5) ప్రాస నియమం ఉంటుంది. (6) యతి మాత్రము2,4 పాదములందు 4వ గణము మొదటి అక్షరమునకు చెల్లుతుంది. బేసి గణము అనగా 1,3,5,7 గణములు జగణమై యుండరాదు. 2,4 పాదములలో మూడవ గణము. జ గణము గాని, నలము గాని, అయి వుండాలి. (IUI లేదా IIII)

ఉదా॥ బిడ్డల|గని పో|లిచ్చెడు = భ, స, భ
దొడ్డత|నంబున్న|పుటగు|దొరసా|నివి నా = భ గగ, నల, స, స

కద్దుపడదిగినవేలుపు = భ,వల,భ
గిడ్డివినా మనవి నాలకించెదవు గదా = భ,భజ,భ,భ గణములు కల్గియున్నవి.

**ద్విపద సూత్రం :** ఇంద్ర గణములు మూడు ఇనగణంబొక్కటి పాద పాదమందు జరుగుచుండు. ద్విపదులలో ఇంద్ర, సూర్య గణములు వాడుదురు. 1) ద్విపదకు రెండు పాదములు మాత్రమే వుండును. 2) ప్రతి పాదమున వరుసగా మూడు ఇంద్ర ఒకటి సూర్య గణములుండును. 3) ప్రతి పాదములో మూడవ గణం మొదటి అక్షరం యతి జెల్లును. 4) రెండు పాదములకు ప్రాస నియమం ఉన్నది. 5) ప్రాస నియమం లేనిది (ద్విపదమంజరి) అందురు.

ఉదా॥ మనసు కాలుష్యంబు మహచెడ్డదండి = మ కు - మ యతి, చెల్లును.
మనసంత విషమయం మాటలు తీపి = న.కు. న ప్రాస కుదిరింది.

## ఉపజాతులు:

**తేటగీతి:-** సూత్రం తేటగీతి : సూర్యుడొక్కరుండు సురరాజులిద్దరు
దినకర ద్వయంబు తేటగీతి.

(1) నాల్గు పాదములుండును. (2) ప్రతి పాదము ఒక సూర్య, రెండు ఇంద్ర మరల రెండు సూర్య గణాలుండును. (3) పాదములోని నాల్గవ గణము మొదటి యక్షరం యతి జెల్లును. (4) యతి కుదరనప్పుడు ప్రాస యతి వాడవచ్చును. (5). ప్రాస నియమం లేదు.

**పద్యలక్షణం:**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సూ | ఇం | ఇం | సూ | సూ | |
| U I | U I I | U UI | UI | UI | |
| పక్షి | సుందరి | నీ చిన్ని | కుక్షి | నిండ | క్షి క్షి ప్రాస యతి వాడబడింది. |
| సూ | ఇం | ఇం | సూ | సూ | |
| U I | U I I | U UI | UI | UI | |
| నిన్ని | నీరంబు | బలహార | మున్న | చాలు | న్ని. న్న ప్రాస యతి వాడబడింది. |

ఈ పద్యమునకు ప్రాసయతి వాడబడింది గమనింపుడు.

**ఆటవెలది సూత్రం:** = ఇనగణ త్రయంబు ఇంద్ర ద్వయంబును నగును పంచ సూర్యులాట వెలది.

1) ఇందు నాలుగు పాదములుండును. 2) ఒక్కొక్క పాదములో ఐదు గణములుండును. 3) 1, 3 పాదములొక్క తీరు, మూడు ఇనగణములు రెండు ఇంద్ర గణములుండును. 4) 2,4 పాదములు ఒక్క తీరుగా 5 గణములు సూర్య గణములై యుండును. 5) ప్రతి పాదములో నాల్గవ గణము మొదటి అక్షరం యతి జెల్లును. 6) యతి కుదరనపుడు ప్రాసయతి వాడవచ్చును. 7) ప్రాస నియమం లేదు.

**పద్యలక్షణం:-**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| సూ | సూ | సూ | ఇం | ఇం | సూ | సూ | సూ | సూ | సూ |
| I I I | U I | U I | U UI | U I I | U I | UI | I I I | UI | UI |
| కనుల | జూచి | రమ్ము | కైలాస | భూముల | వింత | లెల్ల | దెలవ | వేళ | లేదు. |

సీసం సూత్రం: ఇంద్ర గణములారు ఇన గణంబులు రెండు పాద [illegible]
ఆటవెలదియుగాని తేటగీతి యున్నైన చెప్పవలయు మీద సీసమునకు.

1. ఇందులో నాలుగు దీర్ఘపాదములుండును.
2. పాదములో వరుసగా ఆరు ఇంద్ర, రెండు సూర్యగణములు కలిపి ఎనిమిది గణాలుండు.
3. బేసి గణము మొదటి యక్షరము యతి జెల్లును.
4. యతి కుదరనప్పుడు ప్రాసయతిని వేయవచ్చును.
5. నాలుగు పాదముల తదుపరి, ఆటవెలదిని గాని, తేటగీతిగాని చేర్చవలయును.

సీసపద్య లక్షణం:-

| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూ | సూ |
|---|---|---|---|---|---|---|---|
| హరిశ్చంద్ర | మహరాజా | ఆలినం | గడనమ్మి | కులహీను | గొల్వడే | బలము | మాని |

| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | సూ | సూ |
|---|---|---|---|---|---|---|---|
| పదకొండ | క్షోహిణిల్ | బలమును | గలయట్టి | కురురాజా | రణభీతి | కొలను | జెరడే |

## 18. అలంకారములు

స్త్రీకి ఆభరణములు అందమిచ్చినట్లు, కావ్యమునకు కూడ అర్థము వల్ల (అనగా భావసౌందర్యము) గాని శబ్దము (పదము)ల పొందిక (లయ) వల్లగాని అందము చేకూరునని లోక విధితము, అట్టి భావ, శబ్ద సౌందర్యమునే కావ్యాలంకారమందురు.

**ఇవి రెండు విధములు:-**

1. శబ్దాలంకారము (ధ్వని, పదముల వల్ల సౌందర్యము నిచ్చునది)
2. అర్థాలంకారము (అర్థము వల్ల అందము ఆహ్లాదము ఇచ్చునది)

**శబ్దాలంకారము గురించి:-**

అర్థముతో పనిలేకుండ కేవలము పదాలనే ఒక పద్ధతి ప్రకారము కూర్చుచేసిన వాక్యము వినుటకు ఇంపు నిచ్చును.

ఈ విధముగా శబ్దములపొందిక వల్ల ఏర్పడునట్టి కొన్ని అలంకారాలు ఇవి.

1. వృత్త్యను ప్రాసాలంకారము
2. ఛేకాను ప్రాసాలంకారము
3. లాటాను ప్రాసాలంకారము
4. అంత్యాను ప్రాసాలంకారము
5. ముక్త పద గ్రస్తపదాలంకారము
6. యమ కానుప్రాసాలంకారము

**1. వృత్త్యనుప్రాస:-** ఒక వాక్యములోగాని, చరణములో గాని, ఒకే హల్లు పలుమార్లు ఆవృతమగుటనే వృత్త్యనుప్రాస యంటారు.

ఉదా॥ బుడి బుడి అడుగుల నడుగిడు బుడతడు ఈచరణములో "డ" కారములు పలు మార్లు వచ్చినది, కావున దీనిని వృత్త్యనుప్రాసయన వచ్చును.

**2. చేకానుప్రాస:-** వర్ణద్వయము భిన్నార్థములతో మరల మరల అవృతమగుట దీని లక్షణముగా చెప్పవచ్చును.

ఉదా॥ కందర్ప దర్ప దమనుడు సుందర ధరహాసుడు, అనువాక్యము నందు దర్ప, దర్ప, ధర అనునవిరెండేసి సార్లు వచ్చినందున దీనిని చేకానుప్రాసాలంకారమందురు.

**3. లాటానుప్రాస:-** అర్థభేదము లేకున్నను తాత్పర్యభేదముగల పదము లాదేశమగువాక్య - ప్రయోగము.

ఉదా॥ కమలాక్షు నర్చించు కరములు, కరములు
శ్రీనాధు వర్ణించు జిహ్వ జిహ్వ ఇలా అర్థబేదములేకున్నను తాత్పర్యము వేరుగా ఉన్నందున లాటాను ప్రాసాలంకారమందురు.

**4. అంత్యానుప్రాస:-** వాక్యము చివరగాని, పద్య పాదము చివరనగాని, ఒకే హల్లు వచ్చినచో అట్టి దానిని
అంత్యాను ప్రాసాలంకారమందురు.

ఉదా॥ తరుచాయన గౌతమునికి జ్ఞానోదయమయ్యెనని చెట్టు నీడన వేమన చెప్పె వేద పారమని ఇలా ప్రతి వాక్యము చివర "మని" "అని" వచ్చు కవిత,గాని, పద్యము గాని, అంత్యానుప్రాస కల్గియున్నదని అంటారు.

**5. ముక్త పదగ్రస్తము:-** వాక్యము చివరనగాని పాదము చివరన గాని వచ్చిన పదము రెండవ పాదము ప్రారంభముననే అవృతంబగు నట్టి దానిని ముక్త పదగ్రస్తమని అంటారు.

ఉదా॥ సుదతీ నూతన మదనా
మదనాగతురంగ పూర్ణమణిమయ సదనా
సదనామయ గజరదనా. . . . ఇలా పైపద్యపాదము చివర
వచ్చినపదము మరుపాదప్రారంభమునవచ్చుచున్నందున దీనిని ముక్త పదగ్రస్తమని చెప్పుదురు.

**6. యమకము:-** ఒక వాక్యములో వచ్చిన పదములే అదే వాక్యములో మరల మరల వచ్చుచు అర్థములో మార్పుకల్గ జేయునది.

ఉదా॥ పురమునందు అంతఃపురము నందు, వాక్యములో పురము అనే పదము అర్థబేదముతో, అంతఃపురము అని వచ్చింది కావున యిది యమకము అయ్యింది.

**అర్థాలంకారములు:** వాక్యములందు గాని, చరణములందు గాని వాడబడు పదములు అర్థవంతమై, చమత్కారయుతముగా ఉండి మనోల్లాసము కల్గించునవి. అర్థాలంకారములందురు, అటువంటి అర్థవంతమైన అలంకారాలను పరిశీలింతము.

**ఉపమాలంకారము:-** ఉపమేయమును, చక్కని ఉపమానముతో వర్ణించబడు దానిని ఉపమాలంకారమందురు.

ఉదా॥ ఈసరోవరం సముద్రము వలె విశాలముగానున్నది, ఇక్కడ

| | | |
|---|---|---|
| సరోవరం | = | ఉపమేయం |
| సముద్రం | = | ఉపమానము |
| వలె | = | ఉపమావాచకము |
| విశాలముగా | = | సమానధర్మము, అన్వయము. |

**రూపకాలంకారము:-** ఉపమేయానికి ఉపమానమునకు భేదము లేనట్లు వర్ణించి లేదా, ఉపమేయమునందు ఉపమాన దర్మాన్ని ఆరోపించి చెప్పుట.

ఉదా॥ జ్ఞాన జ్యోతి, అజ్ఞానాంధకారాన్ని అంతరింపజేయును గదా, ఇందులో జ్ఞాన, అజ్ఞానములు రెండు ఉపమేయములైనను జ్యోతి అనుదానిలో అంధకారమను ఉపమానధర్మములను ఆరోపించబడింది, భేదములేనట్లు సూచింపబడింది.

**ఉత్ప్రేక్షాలంకారము:-** దీని యందు ఉపమేయమును ఉపమానముగా ఊహించుట జరుగుతుంది.

ఉదా॥ ఈ వెన్నెల పాలవెల్లి (పాలసముద్రం) గా ఊహింపబడింది, కావున దీనిని ఉత్ప్రేక్షాలంకారమందురు.

**అతిశయోక్తి అలంకారం:-** వర్ణింపబడు వస్తువును ఉన్న దాని కంటే హెచ్చుగాగాని తచ్చుగానైన వర్ణించుట జరుగుతుంది, ఉపమేయం, మరుగునపడిపోతుంది.

ఉదా॥ రాజసౌధము ఆకాశము నంటు కొనుచున్నది. ఎంత ఎత్తు ఉన్నను రాజసౌధము ఆకాశాన్నంటు కోజాలదు కదా!, దీనినే అతిశయోక్తి అంటారు.

**స్వభావోక్త్యలంకారం:-** సహజ గుణవిశేషణాదులను ఉన్నవి వున్నట్లు చెవులకింపుగా చెప్పునది

ఉదా॥ పచ్చని రెక్కలతో, ఎర్రని ముక్కులతో, తీయనిపలుకులతో చిలుకలు ముద్దుగూర్చుచున్నవి. ఇచట, చిలుకల స్థితి, ఉన్నది, వున్నట్లుగా మనోహరంగా వర్ణించి చెప్పబడింది.

**సందేహాలంకారము:-** ఒక వస్తువును చూచి దానిని ఇదమిద్దముగా నిర్ణయింపలేక అనుమానము కల్గుటనే సందేహాలంకారమందురు.

ఉదా॥ ఆమె ముఖము, కమలమా! లేక చంద్రబింబమా! నిర్ణయించుటకు వీలు లేనట్లున్నది అను భావము కల్గుటనే సందేహాలంకారము అందురు.

**క్రమాలంకారము:-** కొన్ని విషయాలను క్రమానుసారంగా అన్వయించు నట్లు వర్ణించుట.

ఉదా॥ శత్రుని, మిత్రుని, విపత్తుని= జయింపుము, రంజింపుము, భంజింపుము అనువానిని యధాక్రమము కూర్పుచేసి చెప్పుట. అనగా శత్రుని జయింపుము/మిత్రుని రంజింపుము/విపత్తుని భంజింపుము, అని ఈవిధముగా అన్వయంచుటనే క్రమాలంకారమందురు.

# 19. ప్రాసలు

ప్రాసలు(ఏడు) రకములు

అవి, 1. సుకరప్రాస 5. ద్విప్రాస

2. అనుప్రాస 6. త్రిపాస

3. దుష్కరప్రాస 7. చతుర ప్రాస యనునవి.

4. అంత్యప్రాస

1. సుకరప్రాస:- ప్రాసస్థానమున సుకరమైనట్టి సులభమయిన అక్షరములున్నచో అది సుకరప్రాసయనబడును.

ఉదా॥ కమల దళ నయన సకలా

గమ వేద్య పురాణ పురుష కరుణాకరమ

ద్రమ హీనప్రియ తనయా

రమణ యమామి బలుక సుఖకరప్రాసమగున్

ఇందులో సుకరమైన "మ" వర్ణము ప్రాసలో ఉండుటయే, సుకరప్రాస అయింది.

2. అనుప్రాస:- ప్రాసాక్షరము పద్యమున మరల, మరల ప్రయోగింపబడినచో అది అనుప్రాసమనబడును.

ఉదా॥ నందనుత పురందర ముఖబృందారక వంద్యదాసబృందావనగో

విందయననను ప్రాసం బందంబగు నెందు గృతుల యందుముకుందా

పై పద్యపాదములందు ప్రాసస్థానములోని "ద" యను వర్ణము మరల మరల బహుపర్యాయములు వచ్చింది కావునయది అనుప్రాస అయింది.

3. దుష్కరప్రాస:- ఇందులో విసర్గపూర్వక వర్ణాదులు ప్రాసాక్షరములగా వాడబడినవి.

ఉదా॥ దుష్కృత గిరి వజ్రాయుధ

పుష్కర సదనాధినాథ బుధనుతధవళో

చిష్కేశా హరయననీ - దుష్కర మనిదీని బలుకుదురు ప్రావజ్ఞుల్.

ఇందులో "ష్క" యను దుష్కరమైన సంయుక్తాక్షరమువ్వందున దుష్కర ప్రాసమైనది.

4. అంత్యప్రాస:- గురుపూర్వకమైనగాని, లఘుపూర్వకమైన వర్ణము పాదాంతమున వచ్చిన అది అంత్యప్రాసమనబడును.

ఉదా॥ ప్రజా స్వామ్యపాలనలో పాలుపంచుకొమ్మని

ప్రజ్ఞా పాటవంబుతోడ ప్రభుతనెన్నుకొమ్మని, అనుగేయమునందు పై పాదములలో అంత్యప్రాస "ని" అక్షరమైనందున దీనిని అంత్య ప్రాసయందురు.

5. ద్విప్రాస:- దీనినే ద్వంద్వప్రాసయని కూడ అంటారు. ఇందు ప్రాసస్థానమున రెండేసి ఒకే వర్ణములు

ఉండునట్లు రచించుట.

ఉదా॥ వ్యాసము ని వినుత గోప
స్త్రీ నము దయ మానహరణ శృంగారనసా
వా సము గవిట్లు ద్వంద్వ
ప్రాసము కావ్యముల జెప్పబడు నెల్లెడలన్,

ఇందులో ప్రతి పాద ప్రాస స్థానమున రెండు ఒకే విధమైన జంట వర్ణములు వచ్చినందున, దీని ద్విప్రాస, లేక, ద్వంద్వప్రాస యందురు.

6. త్రిప్రాస:- ప్రాసస్థానమున మూడెసి ఒకరకములైన పదములాదేశమగుట.

ఉదా॥ తిరమగు త్రిపాసముసుం
దరమగు మురవైరి రూపుతరుణులకు మనో
హరమగు దానవులకు భీ
కరమగు దపసులకు ముక్తి కరమగుననినన్.

పై పద్య ప్రాసస్థానమున, ర,మగు, అను అక్షరములు వరసగా వచ్చినందున దీనిని త్రిప్రాస యందురు.

7. చతుర్ప్రాస:- ప్రాసస్థానమున వరుసగా నాల్గు అక్షరములు ఒకే రకముచెప్పుట.

ఉదా॥ ధీరుడుకమనీ యశుబా
కారుడుకమలావధూటి కావ్యదుహృదయా
ధారుడుకు మతి జనాధిక
దూరుడుకమలాక్షుడన జతుర్ప్రాసనజా.

పై పద్యములో వరుసగా, రు,డు,క,మ, అను అక్షరములు వరునగా వచ్చినందున ఇయ్యది చతుర్ప్రాసయనబడును.

## 20. వ్యాకరణాది దోషములు సవరణ

వాక్యప్రారంభమున, య,వు,వ,ఙ,ళ, అను అక్షరాలతో గాని వాని యొక్క గుణితముతోగాని ఏర్పడు అక్షరముతోగాని వ్రాయరాదు.

ఉదా॥

| | | | |
|---|---|---|---|
| ఏమి | ఒప్పు | యేమి | తప్పు |
| ఊరు | ఒప్పు | వూరు | తప్పు |
| ఒక | ఒప్పు | వొక | తప్పు |
| నగ | ఒప్పు | ఙగ | తప్పు |
| లంక | ఒప్పు | ళంక | తప్పు |

తెలుగు వాక్యములో చివరి పదము పూర్ణబిందువుతో ముగింపరాదు.

ఉదా॥ మేము పాఠము చదివితిమి-ఒప్పు, మేము పాఠము చదివాం తప్పు

వాక్యముల మధ్యన అచ్చుల ను వాడరాదు-కూడదు.

ఉదా॥ మేము వూరికి పోవుదుము ఒప్పు మేము ఊరికి పోవుదుము తప్పు

మాకు దారిలో వొక పులికన్పించెను ఒప్పు మాకు దారిలో ఒక పులి కన్పించెను తప్పు

న,య,మ,వ,ల అను అక్షరాలకు ముందు పూర్ణబింధువు నిషిద్ధము

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా॥ | చిన్న | ఒప్పు | చింన | తప్పు |
| | భయం | ఒప్పు | బయం | తప్పు |
| | కమ్మ | ఒప్పు | కంమ | తప్పు |
| | తన్వ | ఒప్పు | తంవ | తప్పు |
| | పొలము | ఒప్పు | పొలం | తప్పు మొదలగునవి |

## పునరుక్తులు వాడుటకూడదు

| | | |
|---|---|---|
| ఉదా॥ | దొరగారు గార్కి, | గారు అన్నా గారికి అన్న ఒకటే అర్థము |
| | యాదగిరి గుట్ట | గిరి అన్నా గుట్ట అన్నా ఒకటే అర్థము |
| | సింహాచల పర్వతం | చలం అన్నా పర్వతం అన్నా ఒకటే అర్థము |
| | మండలాధికారి గార్కి | కారి అన్నా గారు అన్నా ఒకటే అర్థము |

| | | | |
|---|---|---|---|
| రేఫ ద్విత్వము వ్రాయుటకు బదులు ్ర | - | గుఱ్రము | తప్పు |
| శకట రేపము వ్రాయవలయును ఱ్ఱ | - | గుఱ్ఱము | ఒప్పు |
| | | కొ్రలు | తప్పు |
| | | కొఱ్ఱలు | ఒప్పు |

విగ్రహ సమాసములు

## 21. సమాస, విగ్రహవాక్యములు

ప్రియమైన విద్యార్థులకు,

మూల్యాంకన పరీక్షా విధానాన్ననుసరించి ప్రశ్న పత్రములందు, సమాసములకు విగ్రహవాక్యములు, సమాసనామములు తెలుపుడంటు ఇవ్వబడుచున్నవి.

కావున విద్యార్థులకు సులభ అవగాహన కొరకు వలయు విభక్తుల గుర్తులతో ఆయా సమాసములను విడదీసి విగ్రహములను, సమాసనామములను వివరిస్తు అన్ని రకముల సమాసములను పొందుపరచడం జరిగింది.

వీటి సహాయముతో ఇంకను రాబోవు క్రొంగ్రొత్త వానిని గూడ గుర్తించి పరీక్షలందు విజయాన్పొందగలరని ఆశించుచున్నాను.

# 22. జాతీయములు

(సొంతవాక్యప్రయోగాలు)

**8,9, 10వ తరగతి విద్యార్థులకు పబ్లిక్ పరీక్షలందు 2 జాతీయములిచ్చి స్వంత వాక్యములలో వ్రాయమందురు. కావున కొన్నింటిని ఇవ్వడం జరిగింది. పఠించి ఫలితమందండి.**

1. **అజ్ఞాతము** = తెలియకుండుట
తమకక్ష సాధనకై కొందరు యువకులు సమాజాన్ని వదలి అజ్ఞాతములోకి వెళ్ళుచున్నారు.
2. **అగ్రగణ్యులు** = మొదట లెక్కింపదగిన వారు
(నేటి రాజకీయ నాయకులలో వాజపేయిగారు అగ్రగణ్యులు).
ప్రబంధకవులలో అల్లసాని పెద్దన అగ్రగణ్యుడు)
3. **అండదండలు**= సహకరించు
విద్యార్థులకు ఉపాధ్యాయులు అండదండలు అవసరము.
(బురద) అడుసు ద్రొక్కనేల, కాలుకడుగనేల = తప్పు జేసి పశ్చాత్తాప పడుట: చెడ్డవారితో స్నేహము చేసి భంగపడినవారినుద్దేశించి, అడుసు, ద్రొక్కనేల, కాలు కడుగ నేల అని అంటారు.
4. **అడుగంటి పోవు** = నశించు
ఈనాటి రాజకీయ నాయకులలో సేవాదృక్పథము అడుగంటిపోయింది.
5. **అణిముత్యములు** = మేలైనవి
పెద్దమాటలు అణిముత్యాముల వంటివి.
6. **అరచేతిలో వైకుంఠం** = అతి సులువు
ఎన్నికలప్పుడు నాయకులు అరచేతిలో వైకుంఠం చూపెదరు.
7. **అందెవేసిన చేయి** = మిక్కిలినేర్పు
క్రికెటులో (సచిన్) అందెవేసిన చేయి.
8. **అల్లారు ముద్దుగా** = అమితగారాభముగా
రాకుమార్తె ను దాసీలు అల్లారు ముద్దుగా పెంచిరి.
9. **ఆటుపోటులు** = హెచ్చుతగ్గులు అగుట
జీవితగమనములో ఆటుపోటులు తప్పవు.
10. **అవలీలగా** = సులభంగ
కరణం మల్లీశ్వరి 125 కేజీల బరువును అవలీలగా ఎత్తగలదు.
11. **ఆదర్శప్రాయము** = అన్నింటిలో ప్రథముడు
దేశభక్తిలో త్యాగబుద్ధిలో భగత్‌సింగ్ అందరికి ఆదర్శప్రాయము.
12. **ఆపాదమస్తకము** = పాదముల నుండి తలవరకు
క్రోధాగ్ని మానవున్ని ఆపాదమస్తకము దహిస్తుంది.
13. **ఆలవాలము** = నిలయము
హిమాలయాలు మంచుకు ఆలవాలము
14. **ఇచ్చకములాడుట = ముఖస్తుతిమాటలు మాట్లాడుట**
స్వార్థజీవులు ఇచ్చకములాడి తమ పని నేరనేర్చుకొందురు.

15. **ఇనుమడించుట** = రెట్టింపగుట
పరుగు పందేములో విద్యార్థులు ఇనుమడించిన ఉత్సాహముతో పరుగులు తీయుదురు.
16. **ఇంగితము** = తెలివి
మానవునికి, ఇంగిత జ్ఞానము అవసరము.
17. **ఉట్టిపడు** = ప్రతిబింబించుట
మా పాపముఖకవళికలో తన తండ్రిపోలిక ఉట్టిపడుచున్నది.
18. **ఉవ్విళ్ళూరుట** = మిక్కుటమైన ఉత్సాహము
సెలవులు ఎప్పుడిస్తారో గ్రామము ఎప్పుడు చేరుతామా అంటు విద్యార్థులు ఉవ్విళ్ళూరుదురు.
19. **ఎలుగెత్తి** = గొంతుచించుకొని
విద్యార్థులు తమదేశప్రతిష్ఠను ఎలుగెత్తి చాటుదురు.
20. **ఎండకన్నెరుగని** = కష్టము ఎరుగనిది
రాచబిడ్డ రమణి ఎండకన్నెరుగనిది.
21. **ఎముకలేని చేయి** = దానశీలి
పూర్వకాలములో బలిచక్రవర్తిది ఎముకలేని చేయి.
22. **ఏకగ్రీవం** = బిన్నాభిప్రాయము లేకుండ
మాఊరి సర్పంచ్ ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డాడు.
23. **ఏకాగ్రత** = ఒకే దానిపై (విషయం) మనస్సు నిలువుట.
విద్యార్థులకు పఠనముపై ఏకాగ్రత అవసరము
24. **కన్నులపండుగ** = నేత్రానందం
శ్రీరామనవమినాడు రామాలయప్రాంగణము కన్నుల పండువుగా కన్పించింది.
25. **కన్నుగీటు** = సైగచేయు
రౌడీలకు తమనాయకుడు కన్నుగీటినచాలు పోరాటానికి సిద్ధపడుదురు.
26. **కర్ణకఠోరం** = వినలేనంతటి నీచము పౌరుషము
త్రాగుబోతుల (బజారులో దూషించుకొను) మాటలు కర్ణకఠోరము.
27. **కత్తిమీదిసాము** = (మిక్కిలి అపాయము)
అంతరిక్షయానము చేయుట కత్తి మీద సాములాంటిది.
28. **కన్నుకుట్టు** = ఓర్వలేనితనము
భారతదేశప్రగతి పాకిస్తానీయులకు కన్నుకుట్టు లాంటిది.
29. **కలలోని వార్త** = అసంభవం
(నింగి, నేల ఏకమగుట కలలోనివార్త)
30. **కంటితుడుపు** = తాత్కాలిక ఊరడింపు
ఎన్నికలముందు నాయకులు ప్రజలకి చేసెవాగ్దనాలన్ని కంటితుడుపులే.
31. **కాకతాళీయము** = అనుకోకుండా జరుగునది
1999లో వాజపేయి ప్రభుత్వము పడిపోవుట కాకతాళీయమేమి కాదు.
32. **కాకిబలగం** = గందరగోళ సమూహము
దేవుని ఫలహారం కోసం విద్యార్థులు కాకి బలగం వలేకమ్ముకొందురు.
33. **కళ్లునెత్తి కెక్కుట** = అహంబావముతో ప్రవర్తించుట
కొంతమందికి అధికారమురాగానే కళ్లునెత్తికెక్కుతాయి.

34. **కన్నులకు గట్టినట్లు** = మిక్కిలివివరంగా
వేమన పద్యాలలో నీతి కన్నులకు గట్టినట్లు గోచరించును.
35. **కుక్కమూతి పందెలు** = చివదిదశలో పుట్టునవి
చెట్టు ముదిరి కుక్క మూతికాయలు కాయును.
36. **కూపస్థమండూకము** = లోకముపోకడ తెలియనివాడు
విద్యార్థులు కూపస్థమండూకాలవలే నుండక జనరల్ నాలెడ్జిని ఆర్జించవలెను.
37. **కొట్టినపిండి** = సులభతరము
పాపయ్య శాస్త్రికి పద్యరచన కొట్టినపిండి.
38. **కడుపార** = పుష్కలంగా
కష్టించిన కార్మికుడు కడుపారతిని కంటినిండ నిద్రించును.
39. **కీలుబొమ్మ** = చెప్పినట్లు తలూవుట
పలనాటి నాగమ్మ చేతిలో నలగాముడు కీలుబొమ్మయినాడు.
40. **గగనకుసుమం** = అందరానిది, అసాధ్యము
ఈనాడు కేంద్రలో ఏకపార్టీ పాలన గగనకుసుమమే.
41. **గతజలసేతు బంధనం** = గతించిన దానికైచింతించుట
పరీక్షతప్పిన తర్వాత వగచుట గతజలసేతుబంధనం లాంటిది,
పొదుపుచేసుకోక--అవసరానికి డబ్బు అవసరమై-అయ్యో-అని ఏడ్చుట.
42. **గాలిమేడలు** = ఊహకందని కోరికలు
కొందరువిద్యార్థులు కష్టపడకుండా పస్టుక్లాసులో పాసు అవుతామంటు గాలిలో మేడలు కడుతారు.
43. **గుండెలుదీసిన బంటు** = దయాదాక్షిణ్యములేని వాడు
దోపిడిదొంగలు పుస్తెల తాళ్లు తెంపుటలో గుండెలు దీసిన బంట్లు.
44. **గోముఖవ్యాఘ్రము** = సాధువువలె కన్పించు దుర్మార్గుడు
ఇంటి దొంగలు గోముఖవ్యాఘ్రముల వంటివారు
45. **గోరు చుట్టుపై రోకటిపోటు** = దెబ్బతగిలిన చోటునే మళ్లీ దెబ్బతగులుట
రాము ముగ్గురాడ పిల్లలని భాధపడుతుంటే నాల్గవ సంతానం కూడ ఆడపిల్లని చెప్పుట గోరుచుట్టుపై రోకటి పోటులాంటిది.
46. **చిలుకపలుకులు** = వచ్చిరాని మాటలు
పసిపిల్ల మాటలు చిలకపలుకుల లాంటివి.
47. **చుక్కెదురు, వ్యతిరేకము**
తెలుగుమాస్టరు గారికి గణితమంటే చుక్కెదురే.
48. **చెవికోసుకొనుట** = మిక్కిలి ఇష్టపడుట
అమ్మాయిలు టి.వి. సీరియల్స్ అంటె చెవిగోసుకుంటారు.
49. **జీవచ్ఛవము** = బ్రతికి చచ్చిన దానితో సమానము
సాకువారు దూరమై ఆలనాపాలన లేక ముదునలి తల్లి జీవచ్ఛమువలే యున్నది.
50. **తలలోనివాలుక** = మిక్కిలి విధేయుడుగా నుండుట
రామునికి లక్ష్మణుడు తలలోని వాలుకవలె మెలిగినాడు.
51. **తనివిదీర** = తృప్తిగా
దీపావళిరోజు పిల్లలు తనివిదీరా టపాకాయలు కాల్తురు.

52. తృణప్రాయము = (విలువలేనిదిగా) గడ్డిపోచగా భావించుట.
లేగ కొరకు గోవుతనతమువునే తృణప్రాయముగా బెట్టినది.
53. తృణీకరించు = నిరాకరించుట
(పెద్దల మాటను తృణీకరించుట తగనివని)
54. త్రికరణ శుద్ధిగా = మనస్సు, వాక్కు, కాయముల సాక్షిగా
(ప్రభుత్వ అధికార్లు త్రికరణ శుద్ధిగా పనిజేయాలి)
55. తోడునీడ = వెన్నంటి ఉండుట
భర్త, భార్యకు తోడునీడగా ఉండవలెను.
56. నంగనాచి = తెలిసియుండియు ఏమెరుగనట్లునటించుట
(నేరస్తులు, పోలీసుల ముందు నంగనాచిగా మాట్లాడుదురు.
57. నిండు, కుండ, (తొణకనివారు)
బళ్ళారి రాఘవ నటనలో నిండుకుండ లాంటి వారు.
58. నీళ్లు నములుట = అస్పష్టముగా మాట్లాడుట
సాహసకార్యము చేయుటకు కొందరు నీళ్లు నములుదురు.
59. నేల-ఈనినట్లు = అధికసంఖ్యలో (మిక్కిలి ఎక్కువగా)
సినితారల మీటింగులకు ప్రజలు, నేల-ఈనినట్లు వత్తురు.
60. పరవళ్లు తొక్కుట = సంతోషముతో గంతులేయుట, ఉద్రిక్తత
వర్షాకాలం గోదావరి నది దవళేశ్వరము వద్ద పరవళ్లు తొక్కుతు ప్రవహిస్తుంది.
61. పట్టుగొమ్మ = ఆధారమయినది
దేశప్రగతికి పల్లె సీమలు పట్టుగొమ్మలు
62. ప్రతీకలు = నిదర్శనాలు
ప్రజాసేవకు ప్రకాశం పంతులు గారు ప్రతీక
63. పట్టిందల్లా బంగారం = చేసిన ప్రతిపని విజయవంతమగుట
అదృష్టం కలిసివస్తె పట్టినదల్ల బంగారమే.
64. పంచప్రాణములు = మిక్కిలిపేమాస్పదము
చంద్రబాబునాయుడికి పార్టీ కార్యక్రమాలంటె పంచప్రాణాలు.
65. పుస్తకాలపురుగు = అధికసమయం పఠించువాడు
మా మామయ్య పుస్తకాల పురుగు.
66. పూసలోదారము = కలిసిపోవుట
బాలబాలికలు పాఠశాలలో పూసలోని దారమువలే కలసిమెలిసి ఉండవలెను.
67. పెట్టనికోట, (గొప్పఆదరణ) రక్షణగా,
హిమాలయాలు మనదేశ సరిహద్దుకు పెట్టని కోటలు.
68. బ్రహ్మరథము పట్టుట = అధికంగా గౌరవించుట
పూర్వము కాంగ్రేస్‌పార్టీకి ప్రజలు బ్రహ్మరథము పట్టిరి.
69. బూడిదలో పోసిన పన్నీరు = చేసినదంతా వృధా అగుట (వ్యర్ధము)
ఎంతో శ్రమించి చేసిన పని భంగమైనప్పుడు బూడిదలో పోసిన పన్నీరైంది అంటారు.
70. బంగారుబాట = మంచిదారి
సత్ప్రవర్తన విద్యార్థుల భావి జీవితమునకు బంగారుబాట.

71. **మూడుపువ్వులు ఆరుకాయలు** = అభివృద్ధి పథములోనుండుట
మా మామయ్య వ్యాపారం మూడుపువ్వులారుకాయలుగా నడుస్తుంది.
72. **మాయని మచ్చ** = తొలగని చెడ్డపేరు
పురుషునికి దొంగతనము, స్త్రీకి వ్యభిచారము, మాయనిమచ్చవంటివి.
73. **మిన్నుముట్టుట** = హర్షాతిరేకము తెలుపుట
ప్రధాని ప్రసంగమునకు హర్షధ్వానములు మిన్నుముట్టినవి
74. **మొక్కవోని** = భంగపడని (దృఢచిత్తం)
ప్రకాశం పంతులుగారిది మొక్కవోని సహసము
75. **మొసలికన్నీరు** = కపటప్రేమను ప్రదర్శించుట
ఎన్నికలప్పుడు ప్రజల ముందు రాజకీయనాయకులు మొసలికన్నీరుకార్తురు.
76. **మడమత్రిప్పని** = వెనుకంజవేయని,
మనదేశ సరిహద్దులలోని జవానులు పోరులో మడమత్రిప్పని వీరులు.
77. **రామబాణము** = తిరుగులేనిది
తలనొప్పికి అమృతాంజనము రామబాణము లాంటిది.
78. **రూపుమాపుట** = నాశనము చేయుట
వరకట్న రక్కసిని రూపమాపుట నేటియువత కర్తవ్యం
79. **లోకాభి రామాయణం** = కాలక్షేపకబుర్లు
మా మిత్రులంతా బస్సుకొరకు చూచి చూచి, లోకాభిరామాయణం మొదలుపెట్టిరి.
80. **వెల్లివిరియుట** = మదివుప్పొంగుట
ఇకరాదు అనుకున్న బస్సువచ్చేటప్పటికి అందరి ముఖాలలో సంతోషం వెల్లివిరిసినది.
81. **వెర్రితలలు** = వక్రించుట
టీవిలో క్రికెట్, ప్రోగ్రాములు విద్యార్థుల హృదయాలలో వెర్రితలలు వేయించుచున్నవి.
82. **వినాశకాలే విపరీతబుద్ధి** = చెడుకాలములో చెడ్డబుద్ధులు
పెద్దలమాట కెదురు జెప్పవానిని, చూచి వినాశకాలే విపరీతబుద్ధి అని అంటారు.
83. **వెన్నుపోటు** = కీడొనర్చుట
మిత్రునికే ద్రోహము తలపెట్టువారిని వెన్నుపోటు గాండ్లు అంటారు.
84. **వేరుపురుగు** = నాశము చేయునది.
పాకిస్తానీయులు మనదేశానికి వేరుపురుగులాంటి వారు.
85. **వైతాళికులు** = మేలు కొలుపువారు
మూఢాచారములను రూపుమాపిన, కందుకూరి, గురజాడ, లాంటివారు నవయుగవైతాళికులు.
86. **హుళక్కి** = శూన్యము
ఉపాధ్యాములన్న నేటి విద్యార్థులలో భయ, భక్తులు హుళక్కి.
87. **స్వస్తి చెప్పుట** = విరమించుట
చాలమంది అమ్మాయిలు ఉన్నత విద్యాదాకా వచ్చి విద్యకు స్వస్తి చెప్పుచున్నారు.
88. **స్వయంకృతాపరాధము** = తానుజేసుకున్న దోషం
యన్.టి.రామారావు పదవి కోల్పువుట స్వయం కృతాపరాధమే.
89. **స్పందన** = కదలిక
భరింపరాని ఘోరదుర్ఘటన విన్న హృదయ స్పందన పెరుగుతుంది.
90. **హర్షామోదం** = అతి ఉత్సాహం
పరీక్షలో ర్యాంకు వచ్చినదనగానే నామిత్రులు హర్షామోదము వెలిబుచ్చిరి.

# 1. విశేషణ పూర్వపద కర్మధారయ సమాసము

ఇందులో మైన,యైన,లైన,అగు,ప్రత్యయములు వచ్చును.

| సమాసము | విగ్రహవాక్యం | సమాసముల పేర్లు |
|---|---|---|
| కపటశైశవం | కపటమైనశైశవం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| అనేక విధములు | అనేకములైన విధములు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| దొడ్డవారు | దొడ్డమైన వారు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| పిన్న వయస్కులు | పిన్నవారైన పడుచులు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| బాలకృష్ణుడు | బాలుడైన కృష్ణుడు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| కమ్మని మాటలు | కమ్మనైన మాటలు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| ముసలి మొగుడు | ముసలియైన మొగుడు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| పుత్తడి బొమ్మ | పుత్తడియైన బొమ్మ | విశేషణ పూర్వపద కర్మధారయ |
| ప్రాచీన కాలం | ప్రాచీనమైన కాలం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| చిన్న గ్రామం | చిన్నదైన గ్రామం | విశేషణ పూర్వపద కర్మధారయు |
| రమ్యప్రకృతి | రమ్యమైన ప్రకృతి | విశేషణ పూర్వపద కర్మధారయ |
| తక్కువ మార్కులు | తక్కువయైన మార్కులు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| అజ్ఞానోక్తులు | అజ్ఞానమైన ఉక్తులు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| అవిరళకృషి | అవిరళమైన కృషి | విశేషణ పూర్వపద కర్మధారయ |
| అధునిక కాలం | అధునికమైన కాలం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| కొత్తలిపి | కొత్త దైన లిపి | విశేషణ పూర్వపద కర్మధారయ |
| చిరుకోపం | చిరుతయైన కోపం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| దీర్ఘయశస్సు | దీర్గమైనయశస్సు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| భక్తకుచేల | భక్తుడైన కుచేలుడు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| మంచి న్యాయం | మంచియైన న్యాయం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| మహాకష్టం | గొప్పదైన కష్టం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| రక్తగాధ | రక్తమైనగాధ | విశేషణ పూర్వపద కర్మధారయ |
| రమ్యస్థలం | రమ్యమైన స్థలం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| రాతి బొమ్మ | రాతిదైన బొమ్మ | విశేషణ పూర్వపద కర్మధారయ |
| విశిష్టదైవతం | విశిష్టమైన దేవతలు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| పెక్కుఇక్కట్లు | పెక్కైన ఇక్కట్లు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| విచిత్ర సంఘటనలు | విచిత్రమైన సంఘటనలు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| చిరునవ్వు | చిరుతయైననవ్వు | విశేషణ పూర్వపద కర్మధారయ |
| అవ్యభాష | అవ్యమైన భాష | విశేషణ పూర్వపద కర్మధారయ |
| సూక్ష్మగ్రహణం | సూక్ష్మమైన గ్రహణం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| నిరాడంబర జీవితం | నిరాడంబరమైన జీవితం | విశేషణ పూర్వపద కర్మధారయ |
| విమల శృంగం | విమలమైన శృంగము | విశేషణ పూర్వపద కర్మధారయ |

**2. ద్వంద్వ సమాసము:** సమ ప్రాధాన్యత కలిగిన పదాలను బహుపద ద్వంద్వ సమాసము లనబడును. **మ, లు, మ,** అను ప్రత్యయము మాత్రమే వచ్చును

| సమాసము | విగ్రహవాక్యం | సమాసముల పేర్లు |
|---|---|---|
| అన్న దమ్ములు | అన్నయును, తమ్ముడును | ద్వంద్వ సమాసం |
| భరత శత్రుఘ్నులు | భరతుడును శత్రుఘ్నుడును | ద్వంద్వ సమాసం |
| నిద్రాహరాలు | నిద్రయును, అహరమును | ద్వంద్వ సమాసం |
| భోగత్యాగములు | భోగమును, త్యాగమును | ద్వంద్వ సమాసం |
| భారత రామాయణాలు | భారతమును, రామాయణమును | ద్వంద్వ సమాసం |
| సర్ప,కిరాత,వరాహ,మృగములు | సర్పమును, కిరాతుడును, వరాహమును, మృగములు | బహు పద ద్వంద్వ |
| నృత్య,గీతములు | నృత్యమును,గీతమును | ద్వంద్వ సమాసం |
| రక్త మాంసములు | రక్తమును, మాంసమును | ద్వంద్వ సమాసం |
| కీర్తి అపకీర్తులు | కీర్తియును, అపకీర్తియును | ద్వంద్వ సమాసం |
| కోట పేటలు | కోటలును, పేటలును | ద్వంద్వ సమాసం |
| చదువు సంధ్యలు | చదువుయును, సంధ్యయును | ద్వంద్వ సమాసం |
| జారచోరులు | జారుడును, చోరుడును | ద్వంద్వ సమాసం |
| తల్లి దండ్రులు | తల్లియును, దండ్రియును | ద్వంద్వ సమాసం |
| పువ్వులాకులు | పువ్వులును, ఆకులును | ద్వంద్వ సమాసం |

**3. షష్టి తత్పురుష కర్మధారయ సమాసము :** ఇందులో **యొక్క, కు, కున్, కిన్, లో, లోపల** అను ప్రత్యయములు వచ్చును.

| సమాసము | విగ్రహవాక్యం | సమాసముల పేర్లు |
|---|---|---|
| దొంగలపాలు | దొంగల యొక్క పాలు | షష్టీతత్పురుష కర్మదారయ సమాసము |
| వింటినారి | వింటియొక్క నారి | షష్టీతత్పురుష కర్మదారయ సమాసము |
| బండి చక్రము | బండి యొక్క చక్రము | షష్టీతత్పురుష కర్మదారయ సమాసము |
| పూరుషాలి | పురుషుల యొక్క ఆలి | షష్టీతత్పురుష కర్మదారయ సమాసము |
| మాసాంతం | మాసము యొక్క అంతము | షష్టీతత్పురుష కర్మదారయ సమాసము |
| కలుష బృందము | కలుషముల యొక్క బృందం | షష్టీతత్పురుష కర్మదారయ సమాసము |

| సమాసము | విగ్రహవాక్యం | సమాసముల పేర్లు |
|---|---|---|
| గ్రహ గతులు | గ్రహము యొక్క గతులు | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసవ |
| పయోనిధి | వయస్సునకు నిధి | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసవ |
| కరుణాపయోనిధి | కరుణకు పయోనిధి | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసవ |
| కౌరవేంద్రుడు | కౌరవులలో ఇంద్రుడు | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసవ |
| ప్రజ్ఞానిధులు | ప్రజ్ఞకు నిధులు | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసవ |
| విదేశబంధుడు | విదేశములలో బంధువు | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| భక్ష్య రాశి | భక్ష్యముల యొక్క రాశి | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| సంగడీల నడుమ | సంగడీల యొక్క నడుమ | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| చీమల పరుగు | చీమల యొక్క పరుగు | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| పుడమిరెక్క | పుడమి యొక్క రెక్క | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| మబ్బురూపు | మబ్బు యొక్క రూపు | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| నాటక ప్రదర్శన | నాటకము యొక్క ప్రదర్శన | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| నీ భార్య | నీ యొక్క భార్య | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| పదప్రయోగము | పదముల యొక్క ప్రయోగము | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| కళారాధన | కళ యొక్క ఆరాధన | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసమ |
| రుక్మిణీ కళ్యాణము | రుక్మిణీ యొక్క కళ్యాణము | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసము |
| స్థల పురాణము | స్థలము యొక్క పురాణము | షష్ఠీతత్పురుష కర్మధారయ సమాసము |

**4. సప్తమీ తత్పురుష సమాసము:** మందు, యందు, అందు అను ప్రత్యయములు గలవి.

| సమాసము | విగ్రహవాక్యము | సమాసము |
|---|---|---|
| జీవన భ్రాంతులు | జీవన మందు భ్రాంతులు | సప్తమీ తత్పురుష సమాసము |
| మొల తామర | మొల యందలి తామర | సప్తమీ తత్పురుష సమాసము |
| సంచ యెచ్చు | సంచయము నందు ఇచ్చు | సప్తమీ తత్పురుష సమాసము |

**5. బహువ్రీహి కర్మధారయ సమాసము:** (వ్యక్తి పరమైనది) కలవాడు, కలది, కలవారు, అను ప్రత్యయములు వచ్చును.

| సమాసము | విగ్రహవాక్యము | సమాసము |
|---|---|---|
| మందమతి | మందమైన మతిగలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| చంద్రముఖి | చంద్రుని కంటి ముఖము గలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| అజాత శత్రువు | పుట్టని శత్రువులు కలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| త్రినేత్రుడు | త్రినేత్రములు కలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| దశకంఠుడు | దశకంఠములు గలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| పీతాంబరుడు | పీత మైన అంబరములు గలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| మధుర వాణి | మధురమైనవాణి కలది | బహువ్రీహి కర్మధారయ |
| ముక్కంటి | మూడుకన్నులు గలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| పాపకర్ముడు | పాపములను కర్మలు కలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| ఖడ్గహస్తుడు | ఖడ్గంహస్తమున కలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| పంకజనాభుడు | పంకజము నాభియందుకలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| సరసిజనాభుడు | సరసిజము నాభి యందు కలవాడు | బహువ్రీహికర్మధారయ |
| హాస్యశీలుడు | హాస్యము శీలముగా గలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| అపుత్రులు | పుత్రులు లేని వారు | బహువ్రీహి కర్మధారయ |
| దీర్ఘకాయులు | దీర్ఘమైన కాయముగలవారు | బహువ్రీహి కర్మధారయ |
| నీలవేణి | నీలమైన వేణికలది | బహువ్రీహి కర్మధారయ |
| చక్రపాణి | చక్రము హస్తము నందుకలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| చంద్రమౌళి | చంద్రుడు మౌళి యందు కలవాడు | బహువ్రీహి కర్మధారయ |
| యశోధరుడు | యశస్సు ధనముగా గలవాడు | బహువ్రీహి కర్మధారయ |

**6. ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసము:** వలె, వంటి, అను ప్రత్యయము కలిగినది

| సమాసము | విగ్రహవాక్యము | సమాసము |
|---|---|---|
| కలువల కన్నులు | కలువల వంటి కన్నులు | ఉపమానపూర్వపద కర్మధారయం |
| ముఖకమలము | కమలం వంటి ముఖం | ఉపమానపూర్వపద కర్మధారయం |
| పాలనవ్వులు | పాలవంటి నవ్వులు | ఉపమానపూర్వపద కర్మధారయం |

7. ద్విగు సమాసము సంఖ్యావాచకము: అవగా అంకెలను స్ఫురింపచేయు సమాసము

| సమాసము | విగ్రహవాక్యము | సమాసనామము |
|---|---|---|
| రెండుమాసములు | రెండుసంఖ్యగలమాసములు | ద్విగు సమాసము |
| కోటిసైనికులు | కోటి సంఖ్యగల సైనికులు | ద్విగు సమాసము |
| దశేంద్రియములు | దశ సంఖ్యగల ఇంద్రియములు | ద్విగు సమాసము |
| పంచపాండవులు | ఐదు సంఖ్యగల పాండవులు | ద్విగు సమాసము |
| ఏడుగడియలు | ఏడైనగడియలు | ద్విగు సమాసము |
| మూడుకన్నులు | మూడైన కన్నులు | ద్విగు సమాసము |
| మూడుతరాలు | మూడైన తరాలు | ద్విగు సమాసము |
| రెండు దశాబ్దాలు | రెండైన దశాబ్దాలు | ద్విగు సమాసము |
| వంద గజాలు | వందైన గజాలు | ద్విగు సమాసము |
| ఐదడుగులు | ఐదుసంఖ్యగల అడుగులు | ద్విగు సమాసము |
| పంచలింగాలు | ఐదు సంఖ్యగల లింగాలు | ద్విగు సమాసము |
| ఒక్క చెణుకు | ఒకటైన చెణుకు | ద్విగు సమాసము |
| రెండు మూరలు | రెండైనమూరలు | ద్విగు సమాసము |

## ప్రకృతిలకు వికృతులు

సంస్కృత పదములకు తెలుగు ప్రత్యయము చేర్చగా ఏర్పడునవి, రాము+డు= రాముడు-ప్రకృతి యందురు అట్లె-సంస్కృత ప్రాకృతముల వలన ఏర్పడునట్టివి చంద్ర-రుడు=చందురుడు వికృతియందురు.

వీనిని విద్యార్థుల సౌకర్యార్థము కొన్నింటిని అక్షరక్రమములో ఇవ్వనైనది పఠించి ఫలితాన్నందుకోగలరు.

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| అప్సర | అచ్చర | ఆకాశం | ఆకసము |
| అన్యాయము | అన్నెయము | ఆజ్ఞ | ఆన |
| అక్షరం | అచ్చరం | అటవి | అడవి |
| ఆశ్చర్యము | అచ్చెరువు | కన్య | కన్నియు |
| అగ్ని | అగి | కథ | కత |
| ఆహారము | ఓగిరం | కీర్తి | కిరితి |
| అర్పణము | అప్పనము | కార్యము | కర్జము |
| ఆశ | ఆస | కాననము | కాన |
| అంబ | అమ్మ | కులము | కొలము |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| కుండము | గుండము | పుస్తకం | పొత్తము |
| కుమారుడు | కొమరుడు | ప్రాకారం | ప్రహారి |
| కష్టము | కస్తి | పక్షం | పక్క |
| క్రందము | కూళ | పర్వం | పబ్బ |
| కృష్ణుడు | కన్నడు | పశువు | పసరం |
| క్షేమము | సేమం | ప్రాణము | పానము |
| కవి | కయి | బుద్ధి | బుద్ది |
| కుడ్యం | గోడ | భారం | బరువు |
| కవిత | కైత | భాష | బాస |
| కాష్టము | కట్టె | భండాగారం | బండారం |
| కర్పూరం | కప్పురం | బ్రాహ్మణుడు | బాపడు |
| గంధము | గందము | భూమి | భూమి |
| గుణము | గొనము | బృంగారం | బంగారం |
| గర్వము | గరువము | భక్తి | బత్తి |
| గార్దభం | గాడిద | బ్రమ్మ | బొమ్మ |
| గృహం | గీము | భోజనం | బోనం |
| గౌరవము | గారవము | తామరరసం | తామర |
| గృహస్తు | గేస్తు | దాత్రి | ధర |
| ప్రజ్ఞ | పగ్గె | ధర్మము | దమ్మము |
| పుణ్యము | పున్నెము | దూరము | దవ్వు |
| పుష్పము | పూవు | త్రిలింగం | తెలుగు |
| పట్టణము | పట్నం | తీరం | దరి |
| పద్యము | పద్దెము | ధూళి | దూలి |
| ప్రయానము | పయనము | దోషం | దోసము |
| ప్రాణం | పానం | దేవాలయం | దేవళం |
| పీఠం | పీట | త్యాగము | చాగము |
| పంక్తి | వరస | దిన | దెస |
| ప్రజ | పజ | దీపము | దివ్వె |
| పురం | ప్రోలు | ద్వయి | దోయి |
| పుష్పం | పువ్వు | దైవం | దయ్యం |
| ప్రాంతం | పాఱు | నిత్యము | నిచ్చలు |
| వృద్వి | పుడమి | నిద్ర | నిదుర |
| పక్షి | పక్కి | వేత్రము | బెత్తము |
| పులుగు | పిట్ట | విద్య | విద్దె |

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి |
|---|---|---|---|
| వంశము | వంగడము | వర్షము | వర్సము |
| విశేషము | విసుసము | శిఖ | సిగ |
| విప్రుడు | పారుడు | శుచి | చిచ్చు |
| విజ్ఞానము | విన్నానము | స్థానం | తావు |
| వేషము | వేసము | స్నేహం | నెయ్యం |
| వైద్యుడు | వెజ్జు | సముద్రం | సంద్రం |
| వ్యాయం | వాయం | సూక్తి | సుద్ది |
| నీరము | నీరు | శబ్దము | సద్దు |
| వర్ణం | వన్నె | సింహం | సింగం |
| చిహ్నం | చిన్నె | హంస | అంచ |
| నిజము | నిక్కము | హితవు | ఇతవు |
| సంతోషం | సంతసం | యత్నం | జతనం |
| స్థలము | తలము | శంఖం | సంకు |
| స్నేహము | నెయ్యము | శాస్త్రము | చట్టము |
| సుధా | సుద్ద | శక్కర | చక్కెర |
| శక్తి | సత్తి | శక్తి | పత్తి |
| స్తంభము | కంభము | యశము | అశము |
| రూపము | రూపు | శ్రీ | సిరి |
| రాజు | రేడు | మంజూష | మందసం |
| రాక్షసుడు | రక్కసుడు | మతి | మది |
| రాత్రి | రేయి | మృత్తిక | మట్టి |
| రాజ్ఞి | రాణి | ముఖము | మోము |
| లక్ష్మి | లచ్చి | ముక్తా | ముత్యము |
| రథము | అరదము | మోధుడు | జోదు |
| సఖుడు | సకుడు | మణి | మిన్న |
| స్త్రీ | ఇంతి | మృగము | మెకము |
| సందేహం | సందియం | యవ్వనము | జవ్వనము |
| సంధ్య | సంజ | ముకుళము | మొగ్గ |
| స్వామి | సామి | మూర్ఖుడు | మోరటు |
| సహాయము | సాయము | మేఘుడు | మొగిలి |
| శృంగారం | సింగారం | ముహూర్తము | మురతము |
| స్నానం | తానం | యశము | అసము |
| శబ్దం | సద్దు | హృదయము | ఎద |
| సహజము | సాజము | | |

# వ్యాస రచనా పద్ధతి

1. వ్యాసం, అనునది ఒక పరిమితమైన రచనా విధానం ఆలోచనల్ని, అనుభవాలను క్రమబద్ధము చేయుటనే వ్యాసము అంటారు.
2. **వ్యాసమునకు ఉండబడు అంశములు (3) మూడు**
   **1. ఉపోద్ఘాతం 2. వ్యాస విషయం 3. ముగింపు**
3. **ఉపోద్ఘాతమనగా :** వ్యాస శీర్షిక యొక్క ఉనికిని వ్రాయుట
   విషయ వివరణ : దీనిని వ్యాస శరీరం అంటారు. దీనిని కొన్ని శీర్షికలుగా వ్రాయవచ్చు.
   ముగింపు : వ్యాసము గురించి తుది పలుకు పై రెండు శీర్షికలపై వ్యాస కర్త అభిప్రాయము వ్రాయుట.
4. వ్యాప రచనలో పాటించవలసిన ముఖ్యాంశములు
   1. ఎన్నుకున్న విషయాన్ని దృష్టియందుంచుకొనుట
   2. విషయాన్ని పేరాలుగా విభజించి వ్రాయాలి.
   3. పేరాలన్ని ఒక దానితో ఒకటి సంబంధము కల్గియుండాలి.
   4. అరసున్నలు, అక్షర దోషాలు లేకుండా ఉండాలి.
   5. సందర్భాన్ని బట్టి, లోకోక్తులు, జాతీయములు పొందుపరచాలి.
   6. వ్యాసరచన పఠితుల్ని ఆకర్షించాలి.

## 1. గ్రంధాలయములు-విద్యావ్యాప్తి

**ఉపోద్ఘాతం:-** గ్రంధాలయములనగా సరస్వతీ నిలయములు, విద్యగంధము అను పరిమళాన్ని ఒకచోట చేర్చినదాని పరిమళము వింతగా విస్తరించి సువాసనలు వెదజల్లుతుంది. అదేవిధముగా విజ్ఞానమును కూడ ఒకచోట చేర్చి అందలి జ్ఞానసంపదను పదిమందికి పంచునిమిత్తము, విజ్ఞాన సర్వస్వము అందించునదియే గ్రంధాలయములు. వీనిలో, సాహిత్య, సారస్వత పురాణ శాస్త్రములు మొదలుకొని అధునిక సాహిత్యము వరకు అన్నిరకముల పుస్తకములుండును.

**ఉనికి:-** పూర్వకాలములో కూడ వీని యొక్క ప్రసక్తి, ఉన్నతంగా ఉన్నది. నలందా, తక్షశిల, విద్యాలయములందు తాటియాకులపై రచించిన గ్రంధములుండేవి, వీనిని మహారాజులు పోషించినట్లు ఆదారములున్నవి. తంజావూరు సరస్వతి మహాలు, మద్రాసులోని "కన్నెమరా" హైద్రాబాద్‌లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము, ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని అతిపెద్ద గ్రంధాలయములు చెప్పుకోతగ్గవి. ఇవన్నియు ఆయాకాలాలలోని సారస్వతాన్ని పంచిన నిలయాలే. గ్రంధాలయాల అభివృద్ధికి కృషిచేసిన వారిలో గాడిచర్ల హరిసర్వోత్తమరావు అయ్యంకి వెంకటరమణయ్య సురవరం ప్రతాపరెడ్డి వంటి వారు ముఖ్యులు.

గ్రంధాలయములలో పలురకముల పుస్తకములను ఉంచుట అవసరం. సామాన్యచదువరికి కూడ అర్ధమగునట్టి కథలు, నవలలు, పురాణములు ఇతిహాసములు, బాలసాహిత్యమువంటి గేయరచనలు గలవి సమకూర్చుట అవసరము గ్రందాలయాల నిర్వహణకై సాహిత్యాభిరుచిగల వారినే లైబ్రరియన్‌లుగ నియమించుట ఉత్తమము. అట్టివారే పాఠకుల అభిరుచికి తగిన గ్రంధసేకరణగావింతురు. పఠితలు కూడ పుస్తకములను స్వంత పుస్తకములవలె భద్రముగా వుంచిన అవి తరువాత తరమునకు ఉపయోగపడునని తలంచవలెను.

గ్రంధాలయాల వల్ల పామాన్యునికి కూడ విజ్ఞానాభివృద్ధి కలుగును. ప్రపంచములో నిత్యము జరుగు సాంఘిక, రాజకీయ, ఆర్థిక, విషయాలు వార్తా పత్రికల వల్ల తెలుస్తాయి. విశ్రాంతి సమయాలలో సత్కాలక్షేపమునకు గ్రంధాలయాలు మిక్కిలి ఉపయోగపడును.

**ముగింపు:-** విజ్ఞాన ఖజానాలైనటువంటి గ్రంధాలయాలు ప్రతి గ్రామములలో నెలకొల్పుట అవసరము, పేదవిద్యార్థులకు ప్రత్యేక బుక్‌బ్యాంకులు నెలకొల్పాలి. చాణుక్యుడు యిట్టిగంధాలయాలతోడ్పాటు తోనే అర్థశాస్త్రమును వ్రాయగలిగేమ. కాబట్టి ప్రభుత్వము హితోధికంగా గ్రాంటు మంజూరి చేసి, ఇట్టి గ్రందాలయాల సంఖ్యను రెట్టింపు చేసినచో నిరక్షరసమస్యను రూపుమాప వచ్చునని చెప్పవచ్చును.

## 2. పచ్చదనం-పరిశుభ్రత

**ఉపోద్ఘాతం:-** పచ్చదనము, పరిశుభ్రత అను రెండు అంశములు మానవునిమనుగడకు పరుసపద సోపానములవంటివి. ఈ రెండు మనిషికి ఆరోగ్యమును, ఐశ్వర్యమును ప్రసాదించునవియే. జనజీవనానికి పచ్చదనము ఎంత ముఖ్యమో, పరిశుభ్రత అంతకన్న ముఖ్యము. వీని యొక్క అవసరమెంత ముఖ్యమో తెలుసుకొందాము.

**పచ్చదనం:-** పచ్చదనము అనగా హరిత విప్లవం అనవచ్చు, పైరు పచ్చదనము, పరిసరాల పచ్చదనము, వనాంతరాల పచ్చదనం, అనగా వృక్షసంపద సంరక్షణలోనే పచ్చదనం హెచ్చుగా కల్పించును. ఈ పచ్చదనము మానవునికి ప్రాణవాయువును, పంటలు మరియు ఫలసాయాన్ని అందిస్తున్నది, కంటికి చలువను ప్రసాదిస్తుంది. రైతు ఆర్థిక వనరులన్నియు పచ్చదనము పైనే ఆధారపడియున్నవి. ఈనాడు శాస్త్రజ్ఞులంతా గళమెత్తి చాటుచున్నది ఏమిటనగా, వనాలను రక్షించుకుంటె వానలు కురుస్తాయని! వానలు కురిస్తేనే పంటలు పండుతాయి, పశుపక్ష్యాదులు మనకల్గుతాయి, అని నీరులేకపోతే ఏజీవి మనలేదని, వుండబోదని అందరెరిగినదే. అందుకే వృక్షో రక్షతిః రక్షితః వృక్షాలను పెంచి కాపాడుకొనుట మానవుని ప్రథమ కర్తవ్యమని, వాటిని మనం రక్షిస్తే అవి మనలను కాపాడుతాయి. పర్యావరణ సమతౌల్యానికి పచ్చదనమే మూలమని వాతావరణ శాస్త్రజ్ఞులు వక్కాణించుచున్నారు.

**పరిశుభ్రత:-** పరిశుభ్రత వల్లనే మానవునికి ఆరోగ్యం లభిస్తుంది "ఆరోగ్యమే మహాభాగ్యం" అన్ననానుడిని బట్టి చూస్తే, ఎన్ని సంపదలున్న ఆరోగ్యవంతుడుగాని వానికి ఎంతవున్న వ్యర్థమే, కాబట్టి ఆరోగ్యము అనునది, మంచిగాలి, మంచినీరు, మంచి పరిశుభ్రమైన పరిసరములు మంచి వాతావరణము పై ఆధారపడియున్నది. ఇవియే మనిషి ఆరోగ్యముగా వుండుటకు కావలసినవి. కావున మానవుడు తన చుట్టు వున్న పరిసరములను పరిశుభ్రముగా ఉంచుకొనుట అవసరము తను శుభ్రంగా వుండుటయేగాక, తన చుట్టువున్న పరిసరాలను, వస్తువులను, గాలిని, నీరును, ఆహారాన్ని కూడ శుభ్రంగా, శుచిగా వాడుకొనుట అవసరం ఆరోగ్యప్రధము-

**ముగింపు:-** పచ్చదనము-పరిశుభ్రత గురించి ప్రభుత్వము కూడ "జన్మభూమి" కార్యక్రమములో భాగంగా భారీఎత్తున ఉద్యమాన్ని చేపట్టి ప్రజలకు వాటి యొక్క ఉద్దేశ్యము, ఉనికిని తెలుపు చిత్రములు, కరపత్రములు పంచుచు, చైతన్యవంతంచేస్తూ పచ్చదనం, పరిశుభ్రతను కాపాడుకోండని ప్రబోధిస్తుంది. కాబట్టి ప్రతి కుటుంబము, ప్రతి విద్యార్థి ప్రతిపౌరుడు తమ వంతుగా పచ్చనిచెట్లను నాటాలి, పచ్చదనాన్ని పోషించాలి, పరిశుభ్రతకై తన చుట్టువున్న పరిసరాలను శుభ్రంగా వుంచుకొని ఆరోగ్యవంతమైన జీవితాన్ని గడుపుటకు ప్రయత్నించాలి ఆరోగ్యవంతులైన పౌరులే దేశప్రగతికి ప్రతీకలు.

## 3. కంప్యూటరు-ఉపయోగం

**ఉపోద్ఘాతం:-** ఈనాడు మానవుని మనుగడకు ప్రత్యక్షముగానో, పరోక్షముగానోఅతి ముఖ్య సాధనంగా పరిగణింపబడుతున్నది. కంప్యూటరు ఎందుకనగా ప్రపంచములోని మానవాళి అంతయు ఒకే కుటుంబంగా తమదైనందిన కార్యక్రమాలు నిర్వహించుకొనుటకు రాకెట్ స్పీడుగల యాంత్రిక యుగాన దినసరి 24 గంటల కాలం సరిపోవుట లేదు, ఒకరి నుండి ఒకరు వార్తా సందేశములు అందిపుచ్చుకొనుటకు కాలపరిధి సరిపోవుట లేదు. కాబట్టి మానవుడు తన మేధను ఉపయోగించి అత్యున్నత స్థాయిలో వైజ్ఞానిక పరిభాషలో కంప్యూటరు అను పరికరాన్ని రూపొందించి తన అవసరాన్ని అతిత్వరగా నెరవేర్చుకొనుచున్నాడు

**వివరణ:-** దీని ద్వారా రోజుల తరబడి చేయవలసిన పనిని, కార్యక్రమమును, గంటలలోను, గంటలోను నిర్వహింపగల కార్యక్రమమును క్షణములలో సమకూర్చుకొనవీలు కల్గుతుంది. కంప్యూటర్ యొక్క ప్రత్యేకత ఏమిటంటే దీని వల్ల రైల్వే స్టేషనులలోను, రాడారు కేంద్రములలోను, ప్రభుత్వ, ప్రైవేటు సంస్థల లావాదేవీలు, సమాచార వార్తా సందేశములు క్షణాలలో చేరవేయబడుచున్నవి. కాబట్టి నేటి పరిస్థితులలో కంప్యూటర్ విద్య అధిక ప్రచారము నొందుచున్నది.

**కంప్యూటరు గురించి:-** కంప్యూటర్ అనేది ఒక ఎలక్ట్రానిక్ పరికరము, దీనికి సంఖ్యాపరమైన 1, 0 అంకెలతో కూడిన, పరిభాషను అందించినచో అది యంత్రములో డీ కోడ్ చేసి మన భాషలోకి అంటె మనకు కావలసిన భాషలోకి అనువాదము జరిపి అందిస్తుంది. ఒక సమస్యను కంప్యూటర్ పరిభాషలో సాధన చేయాలంటె ఏబాషలో తక్కువ కాలములో సరైన ఫలితమందిస్తుందో ఆభాషలో ఆసమస్యను ఎన్నుకొని ప్రోగ్రాము చేస్తారు. ఇందుకు

గాను, సాఫ్ట్‌వేర్ అని, హార్డ్‌వేర్ అను విషయాలను వింటూ వుంటాం, వీని యొక్క అర్థం, సాఫ్ట్‌వేర్ అంటె కంప్యూటర్స్ వేగవంతం చేయడం అని, హార్డ్‌వేర్ అనగా కంప్యూటర్ ఎక్విప్‌మెంటు అడ్జెస్ట్‌అనియు సాంకేతిక పరిభాషలో వ్యవహరిస్తా దీని ద్వారా చాల పరిశోధనలు జరుపబడి సత్ఫలితాలు పొందబడుచున్నవి. కృత్రిమ ఉపగ్రహాల నడపడిని అధ్య చేయుట, అణ్వస్త్ర పాటవమును ప్రయోగించుటకు కూడ దీని అవసరాన్ని వినియోగిస్తున్నారు.

**ముగింపు:-** అయితే దీని వాడకం వల్ల మానవశక్తి నిరుపయోగమవుతుందని కొందరివాదన. అయినను ఉన్నా మానవుని అవసరాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తె ప్రతి చిన్న విషయానికి క్యూ పద్ధతి అవలంబించవలసి వస్తుం కాబట్టి ఆధునిక విజ్ఞానముతో అతి త్వరగా పనులు జరుగుటకు రూపొందించిన కంప్యూటర్‌ను కాదనడం సమ్మతం కానేరదు రాబోవుకాలాన్ని కంప్యూటర్ యుగంగా మార్చి ఉద్యోగ, విద్య అవకాశములు విరివిగా కల్పించి మానవు ఆక్కరను అవసరాన్ని తీర్చడం అవసరం.

## 4. నాకు నచ్చిన కవి

**ఉపోద్ఘాతం:-** కలం నుండి పుట్టినదే కవిత అట్టి కవితను జాతి యొక్క అభ్యున్నతికి ఆర్థిక సాంఘిక ప్రయోజనములకు, అనుగుణంగా, అక్కరకువచ్చేవిధముగా అందించినవారే నిజమైన కవులు. అట్లు సాంఘిక దురాచారములను దుయ్యబట్టి బాల్యవివాహములను రూపుమాపి, వితంతు వివాహములను ప్రోత్సహిస్తు తన కవితా వ్యాసంగములద్వారా సమాజాన్ని మేలుకొల్పి, బంధు జనులచే శుభకార్యములందు వెలవేయబడినను లెక్కగొనక తాను నమ్మిన సిద్ధాంతమును, అకుంఠిత దీక్షతో నిర్వహించి సనాతనులను నిలదీసి నిగ్గుతేల్చిన నవయుగవైతాళికుడు కందుకూరి వీరేశలింగం పంతులు గారంటె, నాకు నచ్చిన, నేను మెచ్చిన కవి.

**విషయం:-** ఎందుకంటె ఆనాడు, కొందరు సనాతన ధర్మపరాయణులు, శాస్త్రమంత తమ స్వంత మన్నట్లు కొన్ని సంప్రదాయాలను, తామునమ్మిన వాటిని "ఆచారములు" అనుపేర వెలకొల్పి వాటిని సమాజముపై బలవంతంగా, రుద్ది ఆచరింపజేసియుండిరి. అవియే రానురాను మూఢాచారములుగా రూపూదిద్దుకొనినవి. వాటి ఫలితమే బాల్యవివాహాలు, "అష్టవర్షే భవేత్ కన్యా" అనియు, స్త్రీ విద్యకు అనర్హురాలని" విధవ వివాహాలు" నిషేధమని, పేర్కొనబడినవి. ఆనాటి ఆర్థిక స్తోమత లేని తల్లిదండ్రులు పసితనముపీడని తమబిడ్డలను 60సం॥రముల వయస్సున్న వృద్ధులకైన సరే ఇచ్చిపెండ్లి చేసెడివారు. అట్టి బాలికలు యుక్త వయస్కులైన నాటికి వృద్ధ పెనిమిటి మరణిస్తె జీవితాంతము కుళ్ళి కృశించెడివారు, వారు పునర్వివాహమునకు అనర్హులుగా ఆనాడు స్త్రీలు ఆటవస్తువులుగా పరిగణింపబడుచుండెడివారు, వారికి విద్య అవసరం లేదు. అట్టి తరుణములో సనాతన బ్రాహ్మణకుటుంబములో రాజమండ్రి పట్టణములో పుట్టి విదేశీ విద్యలు చదవకపోయినను సమాజానికి సరిపడునట్టి, సంఘాన్ని తీర్చి దిద్దునట్టి సంస్కృతాంధ్రములు ఔపోసన బట్టి సమాజములోని మూఢాచారములను తొలగింప నడుముకట్టి, వితంతువివాహాలు జరిపించి, విధవలకువిముక్తి కలిగించి, స్త్రీ విద్యను ప్రోత్సహించి బాలికలకై ప్రత్యేక పాఠశాలలు వెలకొల్పి, బాల్య వివాహాలు త్రోసిపుచ్చి మూఢనమ్మకాలు ఆచరింపకుండా సమాజాన్ని చక్కదిద్దిన నవయుగవైతాళికుడు కందుకూరి వీరేశలింగం పంతులు గారు.

**ముగింపు:** తన జీవిత కాలమంతయు సమాజోద్ధరణకై, వితంతువుల పునర్వివాహాలకొరకు, స్త్రీ విద్యకై తన సర్వస్వము ధారపోసిన దానశీలి, త్యాగధనుడు, తెలుగునేలకు, తెలుగు జాతికి తలమానికమై జాతి రత్నముగా వెలుగునిచ్చిన మహా మనీషి. వీరేశలింగం పంతులు గారు తెలుగువాడైనందుకు తెలుగు జాతి గర్వించుచున్నది.

## 5. క్రీడలు-ప్రయోజనాలు

**ఉపోద్ఘాతం:-** క్రీడలుఅనగా ఆటలు. ఇవి ఏ ఒక్క దేశానికి, ప్రాంతానికి పరిమితమైనవిగావు ప్రపంచదేశాలన్నింట వివిధ రకములైన క్రీడలు నిర్వహింపబడుచున్నవి. ఇట్లు వివిధ రకాల క్రీడలలో తమ యొక్క నైపుణ్యము, చూపుతు పేరు ప్రఖ్యాతులు గడిస్తు, తమకు, తమదేశాలకు కీర్తి ప్రతిష్ఠలు తెస్తున్నారు. అంతేగాకుండా క్రీడారంగములలో ప్రథములుగా గెలిచి, బంగారు పతకాలు బహువిధప్రోత్సాహకాలు పొందుచున్నారు ఎంతో మంది క్రీడాకారులు.

**ఉపయోగం:-** మానవునికి దైనందిన కార్యక్రమములలో ఒక భాగంగా, ఆటలు కూడ చేర్చబడినవి దినమంతా శారీరకంగా శ్రమించిన కార్మికునికి, మానసికంగా కృషిచేసిన ఉద్యోగులు రోజంతా విద్యావ్యాసంగాములో మునిగా

తేలిన విద్యార్థికి తమ విధి నిర్వహణ నంతరము కొంతమనోల్లాసము కోరుకుంటాడు. అట్టిసమయములో తమ కిష్టమైన, ఆటక్రీడను ఎంచుకొని కొంత సమయం అందులో పాలు పంచుకున్నచో దినమంతా చేసిన శ్రమ మరుగుపడి క్రొత్తగా ఉత్సాహం, మనోల్లాసం పొందగలుగుతాడు అదితన ఆరోగ్యవంతమైన జీవితమునకు దోహదపడుతుంది ఆసియా క్రీడా రంగములో మన దేశమునకు చెందిన ఎందరో స్త్రీలు, పురుషులు ఆయా క్రీడలలో నైపుణ్యము కల్గి ప్రపంచ ఒలంపిక్ విజేతలుగా స్వర్ణ రజత పతకాలు అందుకున్నవారు ఉన్నారు. వీరి వల్ల భారతదేశానికి పేరు ప్రతిష్టలు తేబడినవి. అట్టివారిలో పరుగుల రాణి పి.టి. ఉష, వలసమ్మ పద్మినీ, బలపదర్శనలో కరణం మల్లేశ్వరి అదిగాగల స్త్రీలు హాకీ, క్రికెట్ క్రీడరంగములో సచిన్‌టెండూల్కర్, కపిల్ వంటి ఎందరో ఆటగాండ్లు పలువిధ ఆటలలో ఆరితేరిన వారు జాతికి వన్నె తెచ్చిన వారున్నారు.

**క్రీడల యొక్క అవసరం ముగింపు:** ఆటలు బహుమతుల కొరకే కాకుండ, మనోవికాసానికి, ప్రశంసలు పేరుప్రఖ్యాతులు గడించడానికి మనిషికి ఉత్సాహము, కల్గించడానికి ఎంతో అవసరము. ఇవి విద్యార్థి దశలోనే ప్రతిభాపాటవాన్ని కల్గించుటకు ప్రతి ఉన్నత పాఠశాల కొక పి.ఇ.టిని తప్పక ప్రభుత్వమునియమించవలసియున్నది. ప్రతి రోజు కొంత సమయాన్ని కేటాయించి తరగతుల వారీగా వారివారి అభిరుచులకు అనుగుణంగా ఆటలు ఆడించి వారిలోని నైపుణ్యమును వెలికి తీసి ప్రోత్సాహక బహుమతులు అందించినవా భావి జీవితములో అధిక సంఖ్యలో క్రీడారంగమునకు ఎన్నికై దేశ ప్రతిష్ఠను పెంచగలరు అందుకు తగిన ఆట పరికరములు, ఆటస్థలం ఆటల పోటీలకు ప్రోత్సాహము ప్రభుత్వ పరంగా జరుగవలసివుంది. అట్లు జరిగిన నాడు భారత దేశము పాశ్చాత్య దేశాల సరసన క్రీడారంగములో ముందుండగలదని ఘంటా పథంగా చెప్పవచ్చును.

## 6. విద్యార్థులు - క్రమ శిక్షణ

**ఉపోద్ఘాతం:-** ఒక పద్ధతిననుసరించి నడుచుకొనుటయే క్రమశిక్షణ కొన్ని నియమాలను పాటిస్తు దైనందిన కార్యక్రమములను నిర్వహించుట క్రమశిక్షణ పరిధిలోకి వస్తుంది క్రమశిక్షణ మానవ జీవితమునకు జీవగఱ్ఱ వంటిది. క్రమ శిక్షణ యనునది అన్ని రంగాలలోను పాటించదగినది. ప్రత్యేకించి బాల్య దశలో విద్యను అభ్యసించు కాలమున విద్యార్థికి క్రమశిక్షణ అవసరము. పాఠశాల యందే వారికి క్రమశిక్షణ గురించి, ఆచరించు విధానము గురించి బోధించుట వల్ల భావి జీవితములో ఉత్తమ పౌరునిగా, సమాజములో ఆదర్శ జీవితము గడుపుటకు తోడ్పడుతుంది క్రమశిక్షణ లేని విద్యార్థి జీవితము తోకతెగిన గాలిపటమువలె, చుక్కాని లేని నావవలె, బ్రేకులు లేని బస్సు వలే, గమ్యమెరుగని బాటసారిగ మిగిలిపోవును

**వివరణ :** దేశములోని పౌరులందరు క్రమశిక్షణ పాటించినచో దేశము అన్ని రంగాలలో ప్రగతిని సాధించగలదు క్రమశిక్షణ గల వ్యక్తిలో సోమరితనము కన్పించదు. ప్రతిపనిని , నియమిత కాలములో పూర్తి చేయును. క్రమశిక్షణ గల విద్యార్థులున్న పాఠశాలకు మంచి కీర్తి ప్రతిష్ఠ కలుగుటయే గాక మంచి ఫలితములను సాధించి ఆదర్శంగా నిలువ గలదు. కాబట్టి విద్యార్థులు క్రమశిక్షణతో విద్యాభ్యాసము చేయుట అవసరము బాల్యదశ నుండియె పిల్లలకు క్రమశిక్షణ అలవాటు చేయువారు తొలుత తల్లితండ్రులే పెంచి పెద్దవారిని చేయుటతో బాటు శ్రద్ధ వహించి పిల్లలకు మంచి నడవడిని అలవాటు చేయాలి,

విద్యార్థులకు క్రమశిక్షణ పని గట్టుకొని నేర్పనవసరములేదు, వారికి నియమిత వేళలలో వారి యొక్క పనులను క్రమము తప్పకుండ చేసుకొమనట్లు, ఇంటి వద్ద తల్లి దండ్రులు పాఠశాలలో ఉపాధ్యాయులు శ్రద్ధచూపాలి

ప్రతి నిత్యము ఉదయము నిద్రలేచుట, కాలకృత్యములు తీర్చుకొనుట, స్నాన, పానాదులను ముగించుకొని పఠన, వ్రాయుట ఇంటిపని" సంబంధిత విషయములను పూర్తి చేసుకొనుట ప్రార్థనా సమయానికి పాఠశాలకు వెళ్ళుట, గురువుల యెడ వినయత విద్యార్థులతో కలసి మెలసి మంచి విద్యార్థులుగా పేరుతెచ్చుకొనుట అవసరం. క్రమశిక్షణతో పెరిగిన విద్యార్థులే ఉత్తమ భావి పౌరులై జాతికి మణి దీపములు కాగలరు.

క్రమశిక్షణ పాటించని నేటి దేశరాజకీయ నాయకులు బాధ్యతా రహితంగా ప్రవర్తించుట పార్టీలు మారుట ప్రభుత్వములను పడగొట్టుట, ఆందోళలను రెచ్చగొట్టు లంచగొండి తనాన్ని ప్రోత్సహించుట, బంధుప్రీతి పక్షపాత ధోరణి మొదలగునవి జాతికి పెద్ద జాడ్యముగా తయారయింది.

**ముగింపు:** కాబట్టి " నేటి బాలలే రేపటి పౌరులు" అను నానుడిని గుర్తించి చిన్న నాటి నుండియే క్రమశిక్షణతో

పెరిగి పెద్దవారై భావిభారత పురోగతికి బాధ్యులు కాగలందులకు క్రమశిక్షణ అత్యంత అనుసరణీయము.

## 7. జనాభా సమస్య నివారణోపాయము

**ఉపోద్ఘాతం:-** ప్రపంచములోని భూభాగములో భారతదేశము 2.4 శాతం అనగా 1/40 వంతు అన్నమాట, ఇక జనాభా విషయములో మాత్రము ప్రపంచజనాభాలో 14% అంటే 1/7 వంతు) భూభాగం శాతం కంటే జనాభా శాతమే (7) ఏడింతలు అధికంగా వున్నది చైనాదేశ జనాభా తరువరి మన భారతదేశ జనాభాయే రెండవ స్థానములో వుంది మనకు స్వాతంత్ర్యము వచ్చిన 1947 లో జనాభా 43 కోట్లు. ప్రస్తుతము 85 కోట్లకు చేరింది అందుచేత ప్రభుత్వమునకు పాలనా పరంగా గడ్డు సమస్య ఎదురైనది.

**జనాభా పెరుగుదలకు కారణములు:-** ఆధునిక వైద్య సదుపాయాలు తరుచు యుద్ధభయము లేక పోవుట, కరువు కాటకాలు తగ్గుట, పోషక పదార్థములు విరివిగా లభ్యమగుట వరదలు తుపానులను ముందుగానే పసికట్టి నివారణ చర్యలుగైకొనుట అంటువ్యాధులు, కలరా, మసూచి లాంటి వ్యాధులనరికట్టుట కుటుంబ పరిమితిని పాటించకపోవుట, వలన, జననాలరేటు పెరుగుట, మరణాలరేటు తగ్గుటయే అధిక జనాభా పెరుగదలకు మూలకారణము అయినది.

**నివారణ చర్యలు:-** ఎన్ని అభివృద్ధి ప్రణాళికలు అమలుచేసినను అధునిక పద్దతుల ద్వారా అధిక పంటలు పండించినను, జనాభా పెరుగుదల మూలంగా ఏది అందుబాటులో లేక, రాక, నానాఅగచాట్లు దొరలుచున్నవి, ప్రతిచోట, క్యూపద్ధతిలో నడుచుకోవలసి వస్తుంది. కాబట్టి నేటి యువ దంపతులు అధునాతన పరికరముల సహాయమును విరివిగా పొంది కుటుంబనియంత్రణ పాటించవలసివుంది. ఒకరు లేదా ఇద్దరు పావలతో సంతాననిరోదక పద్దతులు పాటించాలి, అందుకు యావత్తు ప్రజానీకము స్త్రీ గాని, పురుషుడు గాని కుటుంబ నియంత్రణ ఆపరేషను విధిగా చేయించుకోవాలి మూఢవిశ్వాసములను విడనాడి, ధైర్యంగా ముందుకు రావాలి. ఆపరేషన్ వల్ల ఏలాంటి అనారోగ్యము కలుగనేరదని నమ్మాలి. బిడ్డకు, బిడ్డకు మధ్యన తగిన వ్యవధిని పాటించుటకు సంతాననిరోదక సాధనాలు వాడాలి, పరిమిత సంతానాన్ని పొందాలి, దేశ సౌభాగ్యానికి తమ వంతు కృషి చేయాలి.
**ముగింపు:** మంది పెరిగిన మజ్జిగ పలచన అన్న నానుడిని దృష్టి యందుంచుకొని తాము తమ కుటుంబము సుఖసంతోషాలలో నడుపుటకు గాను అధిక జనాభా నరికట్టుటకు నడుం బిగించాలి దేశసౌభాగ్యానికి దోహదము చేయాలి.

## 8. సాంకేతిక విద్య ప్రాధాన్యము

**ఉపోద్ఘాతం:** అధునిక పారిశ్రామిక ప్రపంచమున సాంకేతిక విద్య యొక్క ప్రాధాన్యము అనన్యసామాన్యమైనది కాదు. ఎందుకనగా, మానవజీవితము సర్వతో ముఖాభివృద్ధి చెందుటకు, పారిశ్రామిక ప్రగతి సాధించుటకు వృత్తి పరమైన సాంకేతిక విద్య అత్యంత అనుసరణీయమైయున్నది. సాధారణ విద్య వలన నిరుద్యోగ సంఖ్య పెరిగినది. ఉపాధి పరమైన నైపుణ్యం లభించక విద్యాధికులు సైతము నిరాశ నిస్పృహలు చెందుచున్నారు. విద్యార్థిలోకము, తమ కాళ్లపై తాము నిలబడి సంపాదన జేసుకొనుటకు సాంకేతిక విద్యా చాల అవసరము.

**వివరణ:** అనాదిగా భారతదేశం వ్యవసాయికంగా ప్రాముఖ్యము గలది. అత్యధిక జనాభా, శ్రామిక జీవనము చేయువారే అయితే వారు పాత పద్దతుల ద్వారానే ఉపాధి సంభందమైన వృత్తులనవలంబించి ఉత్పత్తులను అధికంగా పెంచలేని కారణంగా దుర్భరమైన జీవితాన్ని గడుపవలసి వస్తుంది. ఇక విద్యార్థులు, నేటి మామూలుపరమైన విద్య నభ్యసించి పట్టాలు చేత బట్టుకొని ఉద్యోగము కొరకు ప్రాకులాడడం వలన నిరుద్యోగము పెరిగి నిరాశా జీవులుగా మిగిలిపోవుచున్నారు.

ప్రస్తుతము మన ముందున్నటువంటి, రష్యా, జపాను, జర్మనీ, వంటి వర్ధమాన దేశాలలో పరిమితమైన ప్రకృతి వనరులున్నను పారిశ్రామిక రంగాలలో ప్రగతిని సాధించి ప్రపంచములో అగ్ర రాజ్యాలుగా భాసిల్లుచుండుట సాంకేతిక విద్య వల్లనే, శ్రామికశక్తి పెరిగి వస్తు ఉత్పత్తిని పెంపొందించుకుని ఆర్థికంగా అభివృద్ధి చెందినవి.

కాబట్టి, మనభారతదేశమునకు అపరిమితమైన ప్రకృతివనరులు, ఖనిజనిల్వలు అధికంగా ఉన్నప్పటికి సాంకేతికలోపకారణంగా వానిని వినియోగించుకొ లేక పోవుచున్నాము. కావున ప్రభుత్వము దేశములోని అన్ని రంగాలలో

సాంకేతిక నైపుణ్యమును అభివృద్ధి పరిచి, వృత్తి విద్యా సంస్థలను నెలకొల్పి, సాంకేతిక టెక్నాలజీలో, విద్యనభ్యసింప జేయుట అవసరం. ప్రస్తుత ప్రభుత్వము కూడ ఇందులకై చాల కృషి చేయుచున్నది. ఇంకను చేయవలసిన అవసరమున్నది.

**ముగింపు:** అట్లు అన్నిరంగాలలో సాంకేతిక నైపుణ్యత అభివృద్ధి చెందినచో మన దేశము ప్రపంచదేశాలతో దీటుగా నిలువగలదని నిరుద్యోగసమస్య నమసి, విద్యార్థులు, తమకాళ్లపై నిలబడిన సంపాదనపరులు కాగలరు. దేశము ఆర్థిక ప్రగతి నందగలదు.

## 9. వాతావరణ కాలుష్యము -నివారణోపాయములు

**ఉపోద్ఘాతం:** వాతావరణము కాలుష్యము అనగా పరిసరముల యందలి గాలి, అపరిశుభ్రముగా తయారగుటను వాతావరణ కాలుష్యమంటారు ఈ కాలుష్యము పట్టణాలయందు, పెద్దపెద్దనగరాలలోను అధికంగా జరుగుతుంది. దీని కంతటికి కారణము కర్మాగారములు, పరిశ్రమలు, వాహనములు అని చెప్పవచ్చును.

**వివరణ:** పూర్వము కుటీర పరిశ్రమ వల్ల ప్రతివారికి పని దొరుకుటయేగాక వాతావరణ కాలుష్యము జరిగెడిదికాదు. మరియు ఆరోజులలో నీడకొరకు, కలపకొరకు, పచ్చదనముకొరకు, ప్రతిచోట చెట్లు నాటి వాటిని కంటికి రెప్పగా కాపాడుకొనెడివారు అట్లు చెట్లను పెంచుట వల్ల సతతహరితము అటునట జరిగెడి వాతావరణ కాలుష్యాన్ని అరికట్ట గలిగేది, పరిశుభ్రమైన గాలి లభించి పౌర జీవనము సుఖప్రదంగా జరిగేది.

కాని నేడు అనేక యంత్ర పరిశ్రమలు, కర్మాగారములు, ఆయిలుతో నడువువాహనములు వెలసి అధికముత్పత్తిని, రవాణా సౌకర్యములను ప్రజలకందించుచున్న మాట నిజమైనను వాటివల్ల మానవమనుగడకు తీరని ముప్పు ఏర్పడుచున్నది. ఎట్లనగా, కర్మాగారములనుండి వెలువడు, చెడువాయువులు, వాహనముల నుండి విడవబడు కార్బన్-డై-ఆక్సైడ్‌తో కూడిన పొగలు, ప్రత్యేకించి పట్టణ వాసులకు ప్రాణాంతకంగా తయారైనది.

ఇందుకుగాను ప్రపంచదేశాలన్నీ ఈ వాతావరణ కాలుష్య సమస్యను నివారింపగలందు లకు సత్వరచర్యలు చేపట్టుచున్నది. అధికంగా చెట్లను పెంచుట, పరిసరాల పరిశుభ్రత, వాహనముల నుండి కర్మాగారములనుండి వెలువడు చెడును అరికట్టుటకు, మరియు వాహనముల రోదను కంట్రోలు చేయుటకై విశేషకృషి జరుగుచున్నది.

**ముగింపు:** ఇందుకై ప్రజలు, పల్లె, పట్నమనకుండ ప్రతి చోట పరిశుభ్రత గురించి శ్రద్ధవహించాలి, అధిక సంఖ్యలో చెట్లను పెంచి, పచ్చదనము, పరిశుభ్రతను అమలుపరచాలి, చక్కని వాతావరణాన్ని కల్పించుటకు ఐక్యతతో కృషి సల్పి, గాలి, నీరు, పరిసరములు, కల్మషముగాకుండ చూచిననాడు, మానవుని మనుగడ ఆరోగ్యప్రదం అవుతుంది.

## 10. స్త్రీ విద్య

**ఉపోద్ఘాతం:** పూర్వకాలములో స్త్రీ కి విద్య అవసరము లేదు. స్త్రీలు విద్యనభ్యసించి పురుషులతో సమానంగా సంపాదించలేరు స్త్రీలు వంటింటికే పరిమితము అనియు, బిడ్డలనుకనుటకు మాత్రమే అర్హులు అని సనాతనులు ఆలోచించెడివారు. విద్యావిహీనః పశుః అను సూక్తి కేవలం పురుషులకే కాదు స్త్రీలకు వర్తించును. స్త్రీలు విద్యావంతులైన గృహము, విద్యానిలయం అవుతుంది. అందుకే నేటికాలమున "చదువు, వెలుగు" ప్రవేశపెట్టి ప్రభుత్వము స్త్రీ విద్యా పేరులకు నాంది. అను నినాదాన్ని ప్రచారముచేస్తు మారుమూల పల్లెలలోని కార్మికుల, కర్షకుల యొక్క బడి ఈడు పిల్లలకు, బ్యాక్ టూ స్కూలు అనే పధకము ద్వారా ఓపెన్‌స్కూల్లు ప్రవేశపెట్టి నూరు శాతం విద్యావంతులజేయ సంకల్పించింది.

**వివరణ:** స్త్రీలు విద్యా వంతులు కావటానికి, గతశతాబ్దమునుండియే పంఘ సంస్కర్తలు, రాజారామమోహన్ రాయ్, వీరేశలింగం పంతులు మొదలయిన వారు బాలికలకై ప్రత్యేక పాఠశాలలు స్థాపించి వారిని విద్యావంతుల జేసి, సమాజములో స్త్రీకి సమాన స్థానము కల్పించినారు. అట్లు చదివిన సరోజినీ నాయుడు, విజయలక్ష్మి పండిట్ దుర్గాబాయిదేశ్‌ముఖ్ వంటివారు రాజకీయ, సాంఘిక, సారస్వత రంగాలలో విశేష ఖ్యాతి గడించినారు, ఇంకను రాష్ట్ర గవర్నర్లుగా పనిచేసిన వారు ఉన్నత పదవులు నిర్వహించినవారు ఉన్నారు.
ప్రధానిగా, సమర్థవంతమైన పాలన అందించిన మహిళా రత్నము, "భారతరత్న" గా గౌరవింపబడింది.

కాబట్టి ప్రభుత్వాలు, ప్రజలు, సమాజము, ఇంకను ఇతోధికంగా స్త్రీవిద్యావ్యాప్తికై కృషిచేయవలసి ఉన్నది. వెనుకబడిన తరగతుల బాలికలకు ప్రత్యేక వసతి గృహములు స్థాపించి, వారికి అన్ని వసతులు కల్పించి చక్కని వాతావరణ [illegible] కల్పిస్తే ఫ్రీగా ఉన్నత విద్య వరకు పెట్టి ఇబ్బందులు ఎదురుకాకుండా విద్యార్జన చేయాలి, అందుకు తప్పకుండా తల్లిదండ్రులు కూడా తమకు కల్గిన సంతానము, "ఆడపిల్ల" అను న్యూనతాభావాన్ని వదిలి వారిని చదివించాలి.

**ముగింపు:** అట్లు చదివిన బాలికలు తమభావి జీవితాన్ని సుఖంగా ఉంచగలరు. తమ కాళ్ళపై తాము నిలబడి సంపాదించు స్తోమత, కలవారగుదురు, పురుషులతో సమానంగా అన్నిరంగాలలో తీసిపోక బాధ్యతలను నిర్వహించి దేశసౌభాగ్యమునకు తోడ్పడుతుందురు.

## 11. స్త్రీలు-సమానహక్కులు

**ఉపోద్ఘాతం:** పూర్వ కాలములో సమాజములో స్త్రీకి ఒక స్థానమంటూ కల్పించక, వంటింటికే పరిమితము చేసి, వారిని, ఆటబొమ్మలుగా, అవసరానికి వాడుకొను వస్తువులుగా నిర్ధారించిరి. కానినేటి ఆధునిక కాలాన, స్త్రీలు పురుషునితో సమానంగా అన్నిరంగాలలో తమ ఆధిక్యతను ప్రదర్శించుచున్నారు. ప్రపంచదేశాలన్నింటిని, స్త్రీల సంక్షేమాన్ని గురించి చర్చించ వలసిందిగా ఐక్యరాజ్యసమితి ఆదేశించడముతో 1975వ సం॥రము అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా వినుతికెక్కినది. అమెరికాలాంటి అభివృద్ధి చెందిన దేశాలలో స్త్రీలు విమోచనోద్యమాలు నిర్వహించి, జనాభాలో సగభాగమైన స్త్రీలకు కూడ పురుషులతో సమానంగా హక్కులు కావాలని పోరాడినవి, సాధించినవి.

**వివరణ:** భారతదేశంలో ఒకప్పుడు మాతృస్వామిక వ్యవస్థయుండేదని ఆంధ్ర శాతావాహనుల చరిత్ర చెప్పుచున్నది. కాని రాను రాను పాశ్చాత్యుల సహవాసదోషముల వల్ల స్త్రీల యొక్క స్థానము హీన స్థితికి దిగజారిపోయింది. కాని నేటి ఆధునిక యుగంలో, ప్రజాస్వామ్యము పరిఢవిల్లుచున్న తరుణములో స్త్రీలు సమున్నత స్థానానికి చేరువగుచున్నారు. విద్యా ఉద్యోగాలలో, రాజకీయ చైతన్యముతో విజ్ఞాన శాస్త్ర అభివృద్ధి కార్యక్రమాలలో ఆర్థిక, సాంఘిక వ్యవస్థలలో పురుషునికి తీసిపోకుండ ముందుకు వస్తున్నారు. ప్రస్తుతం ఏ రంగాలలో చూచిన స్త్రీలే మేలైన, పాలన అందించుచున్నారు. కర్తవ్య నిర్వహణలో క్రమశిక్షణ విషయాలలో ముందున్నారు. కావున ప్రభుత్వము కూడ స్త్రీలకు కూడ 33% భాగస్వామ్యము కలుగజేయుటకు సన్నద్ధమైంది.

**ముగింపు:** స్త్రీ ఇంటికి దీపం ఇల్లాలు అనేది కాకుండ దేశ ప్రగతికి కూడ పట్టుకొమ్మ అని కూడ రుజువు చేయగలందులకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు స్త్రీల హక్కులనుద్దేశించిన బిల్లును ఆమోదించి ఆచరణలో పెట్టుట అవసరము. అట్లు స్త్రీకి సమాన హక్కులు ప్రసాదించిన నాడు ఒక్క చేతితో సాధించబడు దేశ ప్రగతి రెండు చేతులతో అంటె స్త్రీ పురుషుల యొక్క కృషి ఫలితంగా త్వరితగతిన సాధించ వీలు కలుగుతుంది.

## 12. దూరదర్శన్ - టెలివిజన్

**పరిచయము :** శాస్త్ర, సాంకేతిక రంగాలలో అధునాతనమైన అద్భుత పరిశోధనా ఫలితమే 'చిత్రదర్శిని' యొక్క ప్రత్యక్షము. మానవుడు వైజ్ఞానికముగా సాధించిన విజయములలో ఈ చిత్రదర్శిని అను దూరదర్శన్ ఉద్భవము మహా అద్భుతమైనదిగా చెప్పవచ్చును. పూర్వము మహర్షులకు మాత్రమే దూర, శ్రవణ దర్శన శక్తులు ఉండేవని పురాణములలో తెలిపియున్నారు. కాని నేటి టి.వి. రేడియోల రాకతో పైన తెలిపిన అద్భుత శక్తులు నమ్మశక్యమైనవిగా తోచుచున్నవి.

**ఉనికి :** శబ్ద తరంగాలను ఏ విధముగా గాలిలోకి పంపి ప్రసారము చేసినారో అదేవిధంగా దృశ్య తరంగాలను కూడ ప్రసారము చేయుట వలన శబ్దములతో పాటు దృశ్యములను కూడ చూడగల్గుచున్నాము. దృశ్యములను ప్రసారము చేయుటకు ప్రత్యేక సాధనములున్నవి. ఈ దృశ్య తరంగాలను కనిపెట్టిన వాడు స్కాట్‌దేశపు జాన్ లేఖీ బర్డ్ అను ఇంజనీరు మొదట ఉపగ్రహ సహాయమున అమెరికా యూరపుల మధ్య దూరదర్శన్ ప్రసారాలు చేయబడినవి.

**లాభములు :** ఈనాడు దూరదర్శన్ వైద్య, విద్య, పరిశ్రమలలోను, మరియు సముద్ర గర్భ రహస్యములకు, అంతరిక్ష రహస్యములకు కూడ ప్రసార సాధనంగా ప్రముఖ స్థానాన్ని కలిగియున్నది. మారుమూల గ్రామములోని

కర్షకులకు వాటి ఉత్పత్తులను పొందు నేర్పరితనము, తెగుళ్ళ నివారణకు సూచనలు, అధికోత్పత్తికి సహకారము మొదలగువని అందజేస్తూ రైతు బాంధవిగా వన్నెకెక్కినది. అంతేగాకుండ ఉన్న చోటు నుండియే ప్రపంచములోని వింతలు, విడ్డూరములు, వార్తలు, మొదలగు విశ్వ రహస్యములను టి.వి. ద్వారా చూడగలుగుతున్నారు. ఈ దూరదర్శన్ ప్రసారమునకు పెద్ద పెద్ద పట్టణములలో మాత్రమే రిలే కేంద్రములు నెలకొల్పి ప్రసారము చేయబడుచున్నది. (అందువల్ల దీని యొక్క దృశ్య ప్రసారము మారుమూల పల్లె వాసులకు అందుబాటులో లేని కారణంగా కొంత అసౌకర్యము కల్గుచున్నది.)

**ముగింపు :** ఇంత విస్తృత ఉపయోగకారియైన దూరదర్శన్ ప్రసారములు అందరికి అందుబాటులో ఉండునట్లు ప్రభుత్వము ఇంకను అధిక సంఖ్యలో రిలే కేంద్రాలు నెలకొల్పి అధికంగా ప్రసార వ్యాప్తి చేయాలి, మరియు మామూలు రైతు బిడ్డలు కూడ టి.వి. సెట్ కొనగలిగేందుకు వాటి ధరలు ధరలపై విధించు సుంకములు తగ్గించినచో ఎక్కువమంది కొని లాభము, పొందగలరు. అంతేగాక ప్రతి పాఠశాలలో టి.వి. సెట్ నెలకొల్పి విద్యార్థులకు లోకజ్ఞానముతో పాటు వైజ్ఞానికపరమైన వార్తలందించవలెను. ఇట్లు చేయగల్గిననాడు దేశము వైజ్ఞానికంగా అభివృద్ధి చెందగలరని ఘంటా పధంగా చెప్పవచ్చును.

## 13. విజ్ఞాన విహార యాత్రలు

**ఉపోద్ఘాతం :** మానవుడు విజ్ఞానమును అనేక రకములుగా సంపాదించును. విద్యార్థులు పుస్తక పఠనము వల్లనే విజ్ఞానమును పొందలేరు. ఎందుకంటే ఏ విషయమైన విన్న దాని కంటె చూచిన దానినే నమ్మ శక్యమౌతుంది. కాబట్టి సమస్త విషయ పరిజ్ఞానము ఆయా ప్రాంతములను దర్శించి ప్రత్యక్షముగా చూచుట ద్వారా ఎక్కువ విషయావగాహన కల్గుతుంది.

**విషయము :** విద్యార్థులు, తీరిక సమయములందు మరియు టర్మ్ హాలిడేస్‌లలోను, విజ్ఞానమును దానితో పాటు వినోదమును, పొందుటకు చేయు యాత్రలే విజ్ఞాన యాత్రలు, ఈ యాత్రలు విద్యార్థులకు విషయ పరిజ్ఞానము ప్రకృతి పరిశీలనము, లోక జ్ఞాన సంపాదనము, అలాగే కలిసి కట్టుతనానికి, సౌభ్రాతృత్వమునకు చాలవరకు ఉపయోగపడును. విద్యార్థులు ఇటువంటి యాత్రలు చేయుటకు ముందుగా తాము చూడవలసిన ప్రాంతముల ఎన్నిక, ప్రయాణమునకువలసిన వస్తు సేకరణ, ప్రయాణ పద్ధతిని నిర్ణయించుకొనుట అవసరము. యాత్రా స్థలములలో విద్యార్థులు ప్రవర్తించవలసిన తీరు గైడ్సుగా వెంట వచ్చిన ఉపాధ్యాయ బృందము పర్యవేక్షింపవలయును. వారు, చారిత్రక, భౌగోళిక, శిల్పకళా ప్రాశస్త్యము గల ప్రదేశములు అనగా కాశ్మీరలోయలు, తాజమహల్, హంపీ, అజంతా, ఎల్లోరాగుహలు, చారిత్రక ప్రసిద్ధములైన నగరములు గొప్ప గొప్ప కట్టడములు, ప్రసిద్ధ వ్యక్తులు నివసించిన నివాసస్థలములు కర్మాగారములు చూపించి విద్యార్థులలో గ్రహణశక్తిని కలుగ జేయాలి, విద్యార్థులు కూడ తాముచూచిన, తెలుసుకొన్న ప్రతి ముఖ్యమైన విషయాలను నోటు చేసుకొనుట అవసరము, యాత్రానంతరం వాటిని గూర్చి చర్చ, చేసుకొని ఒకరి అభిప్రాయము ఒకరు తెలియపరుచుకొని ధృవపరుచుకోవచ్చును. ఇట్లు మనోవికాసాన్ని అభివృద్ధి పరుచుకొనవచ్చు.

**ముగింపు:-** అందుకుగాను, ప్రభుత్వము విహార యాత్రా స్థలములను అభివృద్ధి పరచాలి, యాత్రలు చేయతలపెట్టిన విద్యార్థులకు ప్రయాణటిక్కెటులపై సగం చార్జీ తగ్గించు ఏర్పాటు కలుగజేయాలి, ఇంకను వెనుకబడిన యస్.సి, యస్.టి. విద్యార్థులను పూర్తి ఖర్చులు ప్రభుత్వమే భరించినచో సముచితముగా ఉండును. ఈ విధంగా సౌకర్యములు కల్పించిన వారికి విహార యాత్రపై ఆసక్తి పెరుగుతుంది.

## 14. మద్యపాన నిషేధము

**ఉపోద్ఘాతం:** మానవున్ని దానవునిగా చేయునది మద్యపానము, ఇది మనిషిని మానసికంగా, నైతికంగా పతనము చేస్తుంది. ఈనాడు మద్యపానము అనునది యువకులలో, ఉన్నత విద్యనభ్యసించు విద్యార్థులలో ఫ్యాషనుగా మొదలయ్యి, వ్యసనముగా తయారై విశ్వరూపము దాల్చి విలయతాండవము చేయుచున్నది. పాశ్చాత్య దేశములలో అక్కడి శీతోష్ణ పరిస్థితులను బట్టి వారు మద్యమును నిత్యావసరవస్తువుగా సేవించగా, మన ఉష్ణమండల దేశములలో కూడ పాశ్చాత్య పద్ధతులపై మోజు పెంచుకొని వారిని అనుకరిస్తు మద్యాన్ని సేవించి, ఆర్థికంగ, నైతికంగా, సాంఘికంగా,

సంసారికంగా పతనావస్థకు చేరడము జరుగుచున్నది.

**వివారణ:-** మహత్మాగాంధి గారు మద్యపాన నిషేదము కొరకు ఎంతయో ప్రయత్నించాడు. స్వాతంత్ర్యోద్యమముతో బాటు మద్యనిషేధోద్యమాన్ని పరిష్కంగా అమలు పరచగలిగారు. కాని ప్రజలలో విచ్చలవిడితనము, చాటుమాటు తనము ఉద్యమాన్ని నీరుగార్చింది-అక్కడక్కడ కొన్ని రాష్ట్రములో మద్యనిషేధము అమలు పరచి, కొంతకాలముపై ప్రజలలో దృఢనిగ్రహము లేని కారణంగ విఫలమైంది. మన రాష్ట్రములో 40సం॥రాల అనంతరము ఈ మహమ్మారిని అరికట్టుటకు రాష్ట్ర వ్యాప్తంగా స్త్రీలు మద్యనిషేదాన్ని ప్రవేశపెట్టునంతవరకు ప్రభుత్వాన్ని స్తంభింపజేసి, సాధించుకున్నారు. అయినప్పటికి పూర్వమువలెనే అధిక సంఖ్యాకుల యొక్క అలసత్వము, విషావస్తువులకు బానిసలైన, ధనిక, పేద, కూలీలు రహస్యంగా సేవించుట, దొంగ సారాయిని ఉత్పత్తిజేయుటచే ప్రభుత్వము మద్యనిషేదాన్ని సడలించవలసివచ్చింది, కుటుంబాల్ని కూల్చివట్టి ఈ రక్కసిని ఆపలేకపోయింది. ఫలితంగా కార్మికులు సారాయి బట్టీలు స్వయంగా పెట్టుకొని, సంపాదనంతా త్రాగుడుకు తగలేసి ఇంట్లో ఆలు బిడ్డలను, అదోగతిపాలుజేసి ఆర్థికంగా కోలుకోలేని పతనావస్థకు దిగజారుచున్నారు.

**ముగింపు:-** ఈ యొక్క మద్య నిషేదాన్ని అమలు పరచాలంటే ప్రజల సహకారము, శ్రమజీవుల యొక్క దృఢదీక్ష మద్యముముట్టమని స్వయం ప్రతిజ్ఞ, ప్రభుత్వముయొక్క శిక్షాస్మృతి కఠినము చేసిననాడు దీనిని అరికట్టవచ్చు, అణగారిన కుటుంబాలకు ఆర్థిక పరిపుష్టిచేకూర్చవచ్చును.

## 15. ప్రజాసామ్యములో ఓటువిలువ

**పరిచయము:-** ప్రజాసామ్యం సుస్థిరముగా మనుగడ సాగించాలంటె దానికి ప్రధాన పాత్రదారులు ఓటర్లు, ఓటువేసే వ్యక్తుల రాజకీయ అవగాహనపైనే దేశస్థితిగతులు ఆధారపడియున్నవి. రాజరికవ్యవస్థ పోయి ప్రజాసామ్య వ్యవస్థ వచ్చిన తరువాత పరిపాలన రంగములో చాలమార్పులు వచ్చాయి. ఈ దశలో ప్రజలే తమకు నచ్చిన, కావలసిన నాయకులను ఎన్నుకుంటారు, సర్‌పంచ్‌తో మొదలయ్యి పార్లమెంటు సభ్యుల వరకు ఎన్నుకోబడు వారే.

**ముఖ్యవిషయము:-** స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత కొంతకాలము వరకు రాజకీయరంగం చాల విజయితీగా సాగింది. నిస్వార్ధపరులైన, దేశభక్తి గల, త్యాగబుద్ధిగల నాయకులు రంగ ప్రవేశము చేసి, ప్రజలకు అన్ని విధాల అన్ని రంగాలలో సేవాభావముతో తోడ్పడి, మన్ననలను పొందారు. రానురాను స్వార్ధము పెచ్చుపెరిగి ఎన్నికలలో గెలిచి ఆర్థికంగా బాగుపడాలన్న దృష్టితో ఎన్నికలలో విచ్చలవిడిగా డబ్బును వెదజల్లి నిరక్షరాస్యులు, అమాయకులు అయిన పేదల బలహీనతలను అనరాగా చేసుకొని ఓటుకునోటు ఎరజూపి ఎన్నికలలో గెలిచి రాజకీయ లబ్ధి పొందుచున్నారు. అంతేగాక, కుల, మత, ప్రాంత, వర్ణ, వివక్షను వినియోగించుకొని కూడ ఓట్లను చీల్చి, ప్రాంతీయ పార్టీలను నెలకొల్పి జాతీయ పార్టీలను దెబ్బతీస్తూ పరిపాలనా సుస్థిరతను దెబ్బతీస్తున్నారు

**ముగింపు:** ఇట్టి పరిస్థితులు మార్చవలసిన అవసరము ఎంతైనవుంది. ప్రజలలో చాలవరకు చదువురాని వారు ఉండుటవలన వారికి ఓటు విలువ తెలియక నిజాయితీ గల నాయకులను ఎన్నుకోకుండ డబ్బుకుఅమ్ముడుపోవుచున్నారు. కాబట్టి కనీసం ఓటువిలువ తెలియుటకు కావలసిన అక్షరజ్ఞానము ప్రతిస్త్రీ పురుషులలో గల్గించుట ప్రభుత్వం యొక్క తక్షణకర్తవ్యము. ఇందుకు గామస్వచ్ఛంద సేవా సంస్థలు, ముందుకు వచ్చి ప్రజలలో రాజకీయ చైతన్యము కల్గించాలి, కార్యకర్తలు హత్యా, రాజకీయాలను హింసావాదాన్ని విడనాడి ప్రజాసేవాధృక్పథమును అవలంబించాలి, ప్రజలు, ప్రజానాయకులు ఎన్నికలను సక్రమముగా నిర్వహించుటకు ప్రభుత్వంతో కలిసి కట్టుగా సహకరించిన ఓటుయొక్క విలువను కాపాడాలి. అప్పుడే ప్రజాస్వామ్యానికి అర్థము వుంటుంది.

## 16. పత్రికలు - ప్రజాస్వామ్యం

**ఉపోద్ఘాతం:** భారతదేశము ఒక పెద్ద దేశము, పర పరిపాలన నుండి విడివడి ప్రజాస్వామ్య దేశంగా రూపొందినది. ఇది ప్రజల చేత, ప్రజల కొరకు, ప్రజల వలన ఎన్నుకోబడి, పరిపాలన కూడ ఆ విధమునవే సాగుచున్నది. ఇది సక్రమముగా పనిచేయుట చాలా అవసరము, దీనిలోనే ప్రజలు స్వేచ్ఛగా, తమ అభిప్రాయాలను వ్యక్తపరచుచు, హక్కులను పరిరక్షించుకోగలరు.

**వివరణ:** ఇందుకు పత్రికల యొక్క పాత్ర చాలా గొప్పది. పత్రికల వల్ల ప్రజల, మధ్య ప్రభుత్వము మధ్యన చక్కని

అనుసంధానము కలుగుతుంది. ప్రజా సనరాలను, ప్రభుత్వమునకు. చేరవేసి వాటిని నెరవేర్చుటకు తోడ్పడుతాయి, అక్రమాలను, దోపిడి వ్యవస్థను, లంచగొండితనాన్ని బందిపోటు వ్యవస్థను, కుట్రలను కుతంత్రాలను బట్ట బయలు చేసి అటు ప్రభుత్వ యంత్రాంగానికి, ఇటు ప్రజలకు అనుసంధానకర్తగా ఉంటూ సహకరిస్తున్నటువంటి చక్కని సాధనమే పత్రికావ్యవస్థ.

కాని ఇటీవల పత్రికా స్వేచ్ఛకు భంగం కల్గించు కొన్ని దుష్ట శక్తులు సమాజములో బయలుదేరి పత్రికా వ్యవస్థను, చిన్నాభిన్నము చేస్తున్నవి. కొన్ని రాజకీయ పార్టీలు తమ ఆధిక్యతను, పత్రికా ముఖంగా పబ్లిసిటి చేయించుకొనుటకై పత్రికలపై దురాక్రమణ, కార్యాలయ ముట్టడి, పత్రికాధిపతులను తమ వైపు త్రిప్పుకొని వార్తలను వక్రగతిలో వెలువరించుకొనుచున్నవి. ఇది చాల నీచమైనది, హేయమైనదిగా భావించవలసిన దురవస్థ.

**పత్రికలయొక్క ధ్యేయము :** ప్రపంచ దేశముల మధ్య సదవగాహన, సత్సంబంధాలు నెలకొల్పుట అవసరము, స్వాతంత్ర్యము తర్వాత పత్రికల యొక్క పాత్ర గణనీయంగా పెరిగింది. ప్రజలలో రాజకీయ చైతన్యము పెరుగుట వలన ప్రతి రోజు దేశములో ప్రపంచములో ఎక్కడ, ఏమి జరుగుచున్నది తెలుసుకొనుటకు ఉవ్విళ్ళూరుచున్నారు.

**ముగింపు:** కాబట్టి పత్రికల ప్రయోజనాన్ని పొందుటకు అన్ని మారుమూల గ్రామాలకు పత్రిక చేరవేయు సౌకర్యము ప్రభుత్వము కల్పించాలి. పత్రికలు ఏ పార్టీకి తలొగ్గకుండ నిజాయితీగా ఉన్న దున్నట్లుగా ప్రభుత్వ పనితీరును, రాజకీయ నాయకుల పనితీరును ప్రజల ముందుంచాలి. అట్లు పత్రికలు నిస్వార్ధ దృక్పధంతో పనిచేసి ప్రజాస్వామ్యమును పరిరక్షించాలి. అట్లు పత్రికలు నిస్వార్ధ దృక్పధంతో పనిచేసి ప్రజావసరాలను తీర్చ కలుగు కామదేనువులు కావాలి అప్పుడే పత్రికలపై ప్రజలకు నమ్మకము కలుగుతుంది.

## 17. విద్యుచ్ఛక్తి

**ఉపోద్ఘాతం :** మనకు ప్రసాదించిన శక్తులలో విద్యుచ్ఛక్తి ప్రధానమైనది. ఆకాశమున ఉరుములు, మెరుపులు జరిగి వానియొక్క ఘర్షణ వల్లనే విద్యుత్ పుడుతుంది. పిడుగులు పడుతాయి. పిడుగు పాటు వల్ల నష్టము జరుగుతుంది. కాబట్టి విద్యుత్ అపారశక్తి గలదని గ్రహించి దాని వలన ఉపయోగాలున్నాయని శాస్త్రజ్ఞులు గ్రహించారు.

**పుట్టుక :** విజ్ఞానశాస్త్ర పరిశోధనల వలన అణు పరమాణువు మార్పుల వల్ల విద్యుత్ ఉత్పాదన కనుగొనబడింది. ఈ విద్యుచ్ఛక్తి మూడు ప్రధాన పాదాల వలన పొందవచ్చునని గ్రహింపబడింది. 1 యాంత్రిక, భౌతిక, రసాయనాలు. భౌతిక, రసాయనాల వల్ల పరిమితంగానే విద్యుత్తు వుత్పత్తి యగును, కాని యంత్రముల సహాయము వల్ల అధిక విద్యుత్‌ను పొందవచ్చును. ఇందుకు నూనె, బొగ్గు, నీరు అనునవి అవసరము.

**విషయ వివరణ:** మనదేశములో నూనె, బొగ్గు ఉత్పత్తులు పరిమితంగా ఉండుట వల్ల వాని ద్వారా కరెంటు ఉత్పత్తికి అధిక వ్యయం, ధనం, పెట్టుబడి అవసరమవుతుంది. నీటి వనరులు, అనగా జీవనదులు పుష్కలంగా వుండుటచేత నీటి ద్వారా జల విద్యుత్‌ను అవసరానికి మించి ఉత్పత్తి చేయవచ్చును. అటువంటి ఆలోచనతో భారత ప్రభుత్వము శాస్త్రజ్ఞుల సలహాలతో పలు నదులపై ఆనకట్టలు కట్టి నీటి నుండి కరెంటు ఉత్పాదన చేయసాగింది. అటువంటి బహుళార్ధక (నీరు+కరెంటు రెండు) అవసరాలకై కావేరి, శివసముద్రం, మాచ్‌ఖండ్, అల్లే సైకారా, నాగార్జున, శ్రీశైలం వంటి ప్రాజెక్టులు నిర్మించి కరెంటును పొందుటకు వీలు కల్పించింది.

**లాభము:** కరెంటు ద్వారా, మానవునికి కావలసిన, అన్ని సౌకర్యములు లభ్యమగుచున్నవి. ఈనాడు విద్యుత్ దీపములు లేని ఇల్లే లేదు. వ్యవసాయమునకు కావలసిన నీటిని పొందుటకు కరెంటు మోటార్లు కరెంటు సహాయమున పరిశ్రమలు అధిక ఉత్పత్తి జరుపబడుచున్నది. మానవునికి కావలసిన అన్ని అవసరాలకు కరెంటు వినియోగింపబడుచున్నందున, దాని యొక్క వాడకం, అధికమైనది. ఉత్పాదనకు మించి ఖర్చు చేయబడుచున్నది.

**ముగింపు:** అందువలన ఎన్నో అవకతవకలు జరుగుచున్నవి. కాబట్టి సక్రమ వినియోగము జరుపబడి అందరి అవసరానికి సరిపడ కరెంటు ఇచ్చుటకై ప్రభుత్వం ఇంకను విద్యుత్ ఉత్పత్తికి వనరులను సమీకరించవలసి వుంది. విద్యుత్ చౌర్యము జరుగకుండ కట్టుదిట్టము చేసిననాడు అవసరాలకు తగిన విద్యుత్ లభించగలదు.

## 18. తుపానులు - వరదలు, కరువులు నివారణ

**ఉపోద్ఘాతం:** ప్రకృతి బీభత్సములలో, కరువులు, తుపానులు అనునవి మానవుని మనుగడకు విఘాతము కల్గించుచున్నవి. ఇవి సంభవించినప్పుడే మానవులు. ప్రకృతి ఆగ్రహానికి గురై నిస్సహాయులు నిరాశ్రయులు అగుచున్నారు.

**వివరణ:** మానవుడు విజ్ఞానపథంలో పయనిస్తు చంద్ర మండలాన్ని అధిగమించి ఇతర గ్రహాలను అన్వేషిస్తు సృష్టికి ప్రతి సృష్టి చేయ వన్నద్దుడగుచున్నాడు. కాని, ప్రకృతిని జయింపలేకపోతున్నాడు. పంచభూతములను జయించలేకపోతున్నాడు. పూర్వ కాలములో రావణుడు అష్ట దిక్పాలకులను తన ఆధీనములో ఉంచుకొన్నాడని రామాయణాది కావ్యములలో వింటున్నాం, ఆధునిక యుగములో కూడ ప్రకృతిని తన ఆధీనములోనికి తెచ్చుకోవాలని మానవుని ప్రగాఢవాంఛ, అందుకై శాస్త్రజ్ఞులు ప్రకృతిని జయించుటకై జరుగుచున్న వైపరీత్యాలను అరికట్టుటకై ప్రయత్నాలు చేస్తున్నారు. అందుకు గాను నభోమండలములో పయనించి ప్రకృతిని వీక్షించి వాతావరణములో సంభవింపబోవు ప్రమాదాలను పసికట్టి ప్రపంచానికి అందించుటకై ఉపగ్రహాలను నిర్మించి రాకెట్ల రూపమున రోదసీ యానము చేయిస్తూ దానిద్వారా ప్రకృతిలో జరుగు పరిణామాలను ముందుగానే తెలియజేస్తూ ఎంతో మేలు కలుగజేస్తున్నారు.

లేకున్నచో ప్రకృతి బీభత్సమువల్ల, అపారనష్టము కలుగును. ఆస్తి నష్టము ప్రాణనష్టము, వస్తు, వాహన నష్టము జరుగుతుంది. పంటలు నాశనము, రహదారులు పాడగుట, వార్తాసంబందాలు నిలిచిపోవుట, అంటువ్యాధులు ప్రబలుట మొదలగు విపరీతములు సంభవించును, అతివృష్టి వల్ల , అనావృష్టి వల్ల, వర్షాలు కురవక, పంటలుఎండి, పశుగ్రాసము కొరవడి, నీరు లభించక, జీవజాలము అన్నగతప్రాణులు, అలమటించి కరువు రక్కసి కబంధ హస్తములలో కవలేని భాదలు అనుభవించవలసి వస్తుంది.

**ముగింపు:-** పై అనర్థాలు జరుగకుండ తుపాను హెచ్చరికలు ముందుగనే తెలియజేయుట ప్రభుత్వవిధి, తుపానుకు దెబ్బ తిను ప్రాంతాలలో రక్షణసదుపాయాలు కల్పించుట అవసరము, అట్లే కరువులు సంభవించినప్పడు, ప్రజావసరాలు తీర్చుటకు, అన్నివిధాల ప్రభుత్వము సహాయంచేయాలి. జీవనదులపై ఇంకను ఆనకట్టలు కట్టి ఉచితంగా వృధాగా సముద్రం పాలగుచున్న నీటిని బీడుభూములకు మళ్లించి కరువులు సంభవించకుండ, వర్షము కురియుటకు కారణభూతమైన వనాలను పెంచుటకు ప్రయత్నించిన ప్రకృతివైపరీత్యాలు రాకుండా నివారించవచ్చును.

## 19. వస్తుప్రదర్శనశాలలు విజ్ఞాన సముపార్జనకు ప్రతీకలు

**ఉనికి:** విద్యాధికులుశాస్త్ర పరిశోధన వల్ల ఎన్నో వినూత్న అంశములను తెలిసికొని వానికి రూపకల్పన చేయుదురు అట్లు రూపొందించిన వస్తువులను ఒకచోటుకు రప్పించి, సేకరించి, ప్రదర్శింప జేయుదురు. అట్టిస్థలాలనే వస్తుప్రదర్శనశాలలంటారు.

**ప్రదర్శన వివరము:-** సమాజములో ఎన్నో వృత్తులవారు ఉన్నారు. వారు తమ వృత్తి నైపుణ్యముతో వస్తువులను తయారుజేసి వానిని ఈవస్తు ప్రదర్శనశాలలలో ప్రదర్శింతురు, చిత్రాలు గీయుట, అతినాణ్యమైన నేతవని, సున్నితమైన వస్తువుల తయారీలు, రైతులు పండించిన పలువిధ పంటలు, అందులో అధికదిగుబడి వంగడాలు, అలాగే దేశములోని వివిధపాఠశాలలలోని విద్యార్థులు తమమేధాశక్తిలో తరగతి ఉపాధ్యాయుల సహకారముతో తయారుచేసిన వైజ్ఞానిక పరికరములు వస్తుపదర్శనశాలలందు ప్రదర్శింతురు, వానిని చూడవచ్చినవారు, వానియొక్క నైపుణ్యతనుచూచి తాముకూడ అలాంటి వానిని, తయారుజేయుటకు ఉద్యుక్తులవుదురు అందువల్ల నాణ్యమైన ఉత్పత్తులు మార్కెటుకు వచ్చువీలు కలుగుతుంది

ఈనాటి పోటీ ప్రపంచములో వృత్తివస్తువు ప్రతినరుకు, మేలైనదిగా ఉండాలని కోరుతున్నారు. ఇట్టి వానిని ప్రదర్శించుటకు సక్రమమైన విధానం అవసరం. వస్తుప్రదర్శనశాలలలో అన్నిరకాల ఉత్పత్తులకు వేరువేరు విభాగములుండునట్లు చూడవలెను విద్యుకళలు, వైద్యము, పరిశ్రమలు పుష్పవిభాగములు కూరగాయలు తదితర వస్తువులు పల్లెవాసులకు అర్థమగురీతిగ ప్రదర్శనలో ఉంచునట్లు ఏర్పాటు చేయవలెను. అట్లుపల్లీయులు ఆదేఉత్పత్తులను చూచి ఆకర్షితులై వాని విత్తనములను కొని అధిక దిగుబడులు సాధించి దేశప్రగతికి తోడ్పడుతారు మరియు

వారిలో బుద్ధివికాసము పెరుగుతుంది. తద్వారా జాతీయ సంపద పెరుగుతుంది. ఇంకను, జంతుప్రదర్శన కూడ చెప్పుకోతగినది రైతులు పోషించు జంతువులలో ఉత్తమమైన వానిని ఎన్నికచేసి సదరు యజమానికి పారితోషికములిచ్చుట అవసరము ఆ విధంగా చేసిన ఇతర రైతు యజమానులకు స్ఫూర్తి కలిగించినచో అధిక సంఖ్యలో మేలు జాతి ఉత్పత్తిని సాధింతురు. దాని వల్ల అధిక పాలదిగుబడి పెరుగుతుంది. ఈ ప్రదర్శనశాలలు దేశప్రగతికి పట్టుగొమ్మలు కాగలవు. నాగరికత గల దేశములిట్టి ప్రదర్శనలను ప్రోత్సహించుచున్నవి. ఇంకను ప్రపంచ వస్తుప్రదర్శనలను కూడ నిర్వహించుట వలన ఎంతో మేలు జరుగుతుందనుటలో సందేహము లేదని చెప్పవచ్చును.

## 20. నీకు నచ్చిన రాజకీయవేత్త

**(కీ.శే. శ్రీమతి ఇందిరాగాంధి)**

**పరిచయం:** శ్రీమతి ఇందిరాగాంధీ గొప్ప స్వాతంత్ర్యసమరయోధుల కుటుంబంలో జన్మించినది. ఆమె మోతీలాల్ నెహ్రూ మనుమరాలు, జవహర్ కూతురు, ఈమె తల్లి కమలానెహ్రూ, ఈమె 19-11-1917 న జన్మించింది, ఈమె విశ్వభారతి శాంతి నికేతన్‌వంటి స్కూళ్లలో చదివి స్విట్జర్లాండులోని ఏడెన్ ఇంటర్నేషనల్ స్కూలులో డిగ్రీ చదివింది. 1942లో ఫిరోజ్ గాంధీని ప్రేమించి పెళ్లి చేసుకున్నది.

**రాజకీయం:-** వీరి తండ్రి జవహర్‌లాల్ నెహ్రూ 1946 నుండి 1964 వరకు భారత ప్రధానమంత్రిగా ఉండిరి. ఈమె 1966 నుండి 1984 వరకు మధ్య 3సం॥రాలు తప్ప మిగతా కాలము ప్రధానిగా దేశాన్ని అన్నిరంగాలలో అభివృద్ధి పరిచినది. వీరు 1938లో కాంగ్రెసు సభ్యురాలుగా రాజకీయజీవితం ప్రారంభించింది. 1959లో అఖిల భారత కాంగ్రేసు అధ్యక్షురాలైయింది. 1966లో లాల్ బహుదూర్ శాస్త్రి మరణానంతరం ప్రధానమంత్రి అయింది. 1977లో ప్రవేశపెట్టిన అత్యవసర పరిస్థితివలన పార్లమెంటు ఎన్నికలలో ఓడిపోయింది. మిగతా కాలమంతయు అఖండ విజయం సాధించింది.

**ప్రధానిగా సేవలు:-** 1971లో పాకిస్థాన్‌తో యుద్ధము చేసి ప్రత్యేక బంగ్లాదేశ్ స్థాపన చేయించినది 1972లో భారతరత్న బిరుదు నోందినది. రాజస్థాన్ ఎడారులలో అణుపాటవ పరీక్ష జరిపించి, దేశఔన్నత్యాన్ని సాటి చెప్పింది రోదసీ పరిశోధనలో దేశాన్ని ఎంతో ముందుకు నడిపించింది. ఆర్యభట్ట భాస్కర, ఇన్‌శాట్, ఇన్‌శాట్ 'బి' వంటి ఉపగ్రహాలను గగనతలానికి పంపించింది పర్యావరణ సంకేతములను రాబట్టి తుపాను వంటి ఉపద్రవాలను ముందుగా పసిగట్టి దేశాన్ని రక్షించు ప్రయత్నాలు చేసింది టి.వి. రేడియో రంగములో వార్తా అభివృద్ధిగావించింది.

**అత్యాయిక పరిస్థితి:** అత్యయిక పరిస్థితి కాలములో దేశములో కొన్ని అక్రమాలు జరిగినప్పుడు ప్రతిపక్షనాయకులందరిని బంధీ చేయించినది బలవంతపు కుటుంబనియంత్రణ జరిపించింది పత్రికా స్వేచ్ఛ అరికట్టబడింది సాహసించి పంజాబులోని సిక్కుల మత పరమైన స్వర్ణదేవాలయాన్ని ఆపరేషన్ చేయించింది. ఫలితంగా 1977 లోఓటమి చవిచూసింది. సిక్కులు కుట్రపన్నీ 1984 లో ఆమె రక్షణ భటులలో సత్వంత్‌సింగ్ బియాంత్ సింగులు అనువారు ఆమెను స్వగృహములోనే కాల్చి చంపారు.

**ముగింపు:** ఆమె భారత దేశములో పుట్టిన రాజకీయనాయకులలో అసమాన చాకచక్యము గల వీరవనితగా పరిపాలన దక్షురాలుగా ప్రపంచదేశాల మన్ననలందిన మహా మనిషిగా చరిత్రలో నిలిచినది.

## 21. జన్మభూమి

**ఉపోద్ఘాతం:** మానవునికి తను పుట్టిన వూరు మొదలుకొని, తన రాష్ట్రము, దేశము అతని "జన్మభూమి" గా చెప్పవచ్చును తాను పుట్టిన వూరికి తనకు జన్మబంధం ఉండి వుంటుంది. అందువల్ల పుట్టిన వూరు, కన్నతల్లి రెండు సమానమంటారు. వ్యక్తి ఎంత ఉన్నతుడైనను, ఏదేశములో నివసించుచున్నను, అతని స్మృతి పథములో తన జన్మస్థలమును గురించి కమ్మనికలలు సుడులు తిరుగుచునే ఉంటాయి. ఇది సత్యం.

**వివరణ:** ప్రజాస్వామ్యయుతమైన భారతదేశములో ప్రజలచేత ఎన్నుకోబడిన నాయకులు పరిపాలన పగ్గాలు చేపట్టి ప్రజల సౌకర్యముల కొరకు అన్ని రంగాలను అభివృద్ధి పరుచుటకు ప్రణాళికలను రూపొందించి పనులు చేయించుదురు. అట్టి అభివృద్ధికరమైన కార్యక్రమాలు అందరికి అందజేయుట ప్రభుత్వమునకు తగిన ఆర్థిక, వనరులు అందనప్పుడు

అట్టి కార్యము వెనుకబడి వాయిదాపడి పోవుట సంభవించును. ఇటు వంటి దశలో మలేసియా కొరియా వంటి దేశాలను ఆదర్శంగా తీసుకొని రాష్ట్ర ప్రభుత్వం "ప్రజల వద్దకుపాలన" "పొదుపు ఉద్యమము" "పరిశుభ్రత, పచ్చదనము" అందరికి విద్య, మహిళాభ్యుదయం,మొదలగు కార్యక్రమములను "జన్మభూమి" అను పథకము ద్వారా, ప్రజలను భాగస్వామ్యులుగా చేర్చి అభివృద్ధికరమైన పనులను చేపట్టి విజయవంతము చేయపూనినది. ప్రజలు తమ గ్రామమునకు కావలసిన వసతిసౌకర్యములో భాగసాములై సగము పనికి ప్రభుత్వనిధులు ఇచ్చునట్లు మిగతా సగమునకు ప్రజలే తమవంతు కృషిచేసి, తమఅభివృద్ధిని తామే చేసికొనుచున్నారు. ఎవరో వచ్చి తమకు ఏదోచేస్తారు అని ఎదురుచూడక వారివారి గ్రామాలను వారే తీర్చి దిద్దుకొనుటయే జన్మభూమి యొక్క లక్ష్యమైయున్నది. గ్రామమునకు కావలసినవి, రోడ్లు, విద్యుత్, పాఠశాల, వైద్యశాల, పశు వైద్యశాల, శానిటరీ, పారిశుధ్యము, మురుగుకాల్వల నిర్మాణం, నీటిసౌకర్యం మొదలగునవి. ధనిక, పేద, స్త్రీ, పురుష బేధములేకుండ అందరు సమైక్యంగ తమ ఊరును తామే అభివృద్ధి చేసుకొనుట ప్రధానలక్ష్యంగా జరుపుకొనుటయే "జన్మభూమి పథకము" యొక్క ధ్యేయమైఉన్నది.

**ముగింపు:-** ప్రతివ్యక్తి మాతృభూమి రుణం తీర్చుకొనుటకు కంకణ బద్ధుడుకావాలి. తానుపుట్టిన గడ్డకు తనవంతు త్యాగంచేయాలి, గ్రామాభివృద్ధిలో భాగస్వామికావాలి, ప్రభుత్వము చిత్తశుద్ధికల్గి నిధులు అందించాలి, పనులు పక్కా నిర్మాణ పద్ధతిలో కొనసాగించాలి. అట్లు ప్రభుత్వము, ప్రజలు కలిసికట్టుగా అభివృద్ధి కార్యక్రమములో పాలుపంచుకొన్ననాడు మన రాష్ట్రము స్వర్ణాంధ్రప్రదేశ్‌గా రూపొందగలదు.

## 22. అణ్వస్త్రనిషేధం-ప్రపంచశాంతి

**ఉపోద్ఘాతం:-** అణ్వస్త్ర వినియోగమును రద్దుచేయుటయే అణ్వస్త్ర నిషేదమనబడును అణ్వస్త్ర ఉత్పత్తి మానవజాతికి ప్రాణభీతిని కల్గించుచున్నది అగ్రరాజ్యాలు, కొన్ని అణ్వస్త్ర ఆయుధాలను వారికి సన్నిహితంగా ఉన్నటువంటి దేశాలకు సప్లయి చేయవచ్చు, తమాదిపత్యాన్ని వెల్లడిచేసుకొనుట చూడగ ప్రపంచములోని శాంతికాముక.

దేశములు గడగడలాడుచున్నవి. దీనిని నివారించుటకై 1984లో స్వర్గీయ ప్రధాని, రాజీవ్‌గాంధీ పర్యవేక్షణలో "అణ్వాస్త్రపాటవనిషేదం" అనుసమస్యపై తీర్మాణం చేయబడింది ఈ సదస్సులో అర్జంటైనా, మెక్సికో టాంజానియా, స్వీడన్, గ్రీస్‌దేశాలు పాల్గొనినవి

**దుష్ఫలితాలు:-** రెండవ ప్రపంచ సంగ్రామములో, హిరోషిమా, నాగసాకిలపై సాగించిన మారణహోమము చూపిన ప్రభావము తదువరి తరాన్ని కూడ పట్టికుడిపినది. వికలాంగులుగా జన్మించారు, వాతావరణ కాలుష్యం ఏర్పడింది భూసారమంత క్షీణించింది పంటలు పండకుండపోయాయి. పశుగ్రాసం కరువైంది ఇటువంటి దుష్ప్రభావం కనులారచూచిన దేశాధినేతలు, అణ్వస్త్రాల వుత్పత్తిని నిలుపు చేయాలని నినదించారు. అంతరిక్షాన్నిసైనిక స్థావరముచేయుట విరమించాలని అణ్వస్త్రపాటవాన్ని నిషేదించి, శాంతిని నెలకొల్పుటయే ప్రపంచ దేశాల ముఖ్యవుద్దేశ్యమని తీర్మానించినారు. కాని రహస్యంగా కొన్ని దేశాలు అణ్వస్త్రాలను తయారుచేయుచున్నవి.

ప్రపంచములోని మేధావి వర్గములు, అణ్వాస్త్రములను ప్రపంచములో మానవ కల్యాణమునకు ప్రగతిసాధనకు మాత్రమే వినియోగించవలెనని, తలంచినది. కాని వినాశనమునకు తగదని విజ్ఞప్తి చేసింది అణ్వస్త్రముల వల్ల ప్రాజెక్టుల నిర్మాణములో రాళ్లను తొలగించుటకు సొరంగ నిర్మాణములకు కాలువలు దీయుటకు ప్రకృతిని జయించుటకు వీలుగామండు విధముగా వాడుకొన సంకల్పించినారు కాని దానికి విరుద్ధముగా మారణహోమానికి కాదు.

**ముగింపు:-** ఈ అణ్వాస్త్రపాటవాన్ని నిషేదించుట అగ్రరాజ్యాలైన, అమెరికా, రష్యా, జర్మనీ, జపాను వంటిదేశాలు పూనుకొని నివారణ సంభవమని దీనికొరకు ఐక్యరాజ్యసమితి సూచనలు చేసింది. ఇట్టి ఆవాంతరాలు తొలిగిపోవుటకు రాజకీయ, సాంకేతిక పరమైన కృషిజరగాలని కోరింది ఇటీవల భారత, పాకిస్తానీలు, అణ్వాస్త్రపాటవ, పరీక్షలు నిర్వహించి ప్రపంచ దేశాల దృష్టికి వచ్చిన నిప్పు, నిప్పే, అదిముట్టుకుంటే కాలుతుందని గ్రహించి అణ్వాస్త్రములను విడనాడుట ప్రపంచానికి మేలు చేయు అందరము శాంతిని కోరుకుందాం, శాంతిని స్థాపిద్దాం ఓం.శాంతి, శాంతి, శాంతి.

## 23. పొదుపు-ప్రయోజనము

**ఉపోద్ఘాతం:** పొదుపు అనగా మితముగా ఖర్చుచేస్తు సంపాదనలో కొంతభాగము కూడబెట్టుకొనుటనే పొదుపు అందురు. మన వద్దవున్న ధనమును గాని, వస్తువులను గాని అవసరానికి తగినట్లు ఖర్చుజేయుట పొదుపరితనమని

కూడ చెప్పవచ్చును.

**పొదుపువిషయం:-** పొదుపు చేయువారికి సదభ్యాసములుండవలయును, మంచిఅలవాట్లు, విచ్చలవిడిగా ఖర్చుచేయకుండుట, ముందు ఆలోచన, ఉండవలెను అట్లుగాక చేతిలో ధనమున్నప్పుడు వెనుక, ముందు ఆలోచింపక, డబ్బును ఖర్చు చేస్తు అవసరములేని వస్తువులను కొనుట, అధికవ్యయము, ఆడంబరాలకు పోయి చేతిలో నున్న డబ్బు ఖర్చుచేసి తదుపరి ఆలోచించుట, అప్పులు, జేయుట అశాంతి పాలుగావటం అవమాన పాలు కావటం జరుగుతుంది. క్రమశిక్షణ కలిగిన కుటుంబములోని వారందరు పొదుపుయొక్క లాభమును గ్రహించుట అవసరం కొన్ని కుటుంబాలలో ఉన్నతోద్యోగులు కూడ అధికవేతనము పొందుచున్నవారు కూడ ఆడంబరజీవితాలకు అలవాటుపడి వేతనము పొందిన 10రోజులలో డబ్బును నీళ్లలాగా ఖర్చుజేసి, తరువరినెలంతయు లేమితో భాధపడుచుందురు. అంతేగాక, ఉన్నతకుటుంబీకులైన సూపిరియారిటీ గల స్త్రీలుకూడ, బజారులో కనిపించిన, చీరలు, వస్తువులు, అలంకరణసామాగ్రి ఇన్‌స్టాల్‌మెంటుపై ఇచ్చు ప్యాషన్ వస్తువులు కొనుటకు వెనకాడరు. అట్లు కాకుండ ప్రతి ఇల్లాలు మితవ్యయమును అలవాటు చేసుకోవాలి తాను చేయువంట ఇంటి పామనులు కూడ పరిమితంగా వాడాలి ప్రతిరోజు వంటచేయుటకు ముందు పిడికెడు బియ్యం, దీసి వేరే చోట భద్రపరుచుచు, వంటలో కూడ పొదుపు పాటించినచో అట్లు తాను తీసిన పిడకెడు బియ్యం వారము తదుపది అదనంగా ఒక పూటకు పరిపోవు బియ్యం ఆదా చేసినట్లు రుజావు అవుతుంది.

**ముగింపు:** నేడు ప్రభుత్వము కూడ పొదుపు విషయమై విసృత ప్రచారము చేయుచున్నది. ప్రతి కుటుంబము ప్రతిఇల్లాలు, ప్రతి, కార్మికుడు తన సంపాదనలో కొంత పొదుపు పేరిట పోష్టాపీసులో, గాని బ్యాంకుల్లోగాని, డబ్బు దాచుకొనినచో అట్లుదాచిన డబ్బు ప్రభుత్వం చేయతలపెట్టిన, అభివృద్ధి కార్యక్రమములకు హెచ్చింపబడి ప్రజోపయోగమునకు పనికి వచ్చును, అంతేకాకుండ తాను పొదుపుజేసిన ధనము రెండింతలై ముందుకాలాన తనబిడ్డల పెండ్లిండ్లకు ఉన్నత విద్యాభ్యాసములకు ఆపద్భాంధవునిగా సహకరించును. కాబట్టి ప్రతిపౌరుడు, ప్రతి ఇల్లాలు, ప్రతి విద్యార్థికూడ కనీసం నెలకు రూ10/-లు పొదుపు చేయుట నేర్చుకొన్నచో తాను బాగుపడుయేగాక పరోక్షంగా, దేశాభివృద్ధికి తోడ్పడిన వారు కాగలరు.

## 24. జాతీయ సమైక్యత

**ఉపోద్ఘాతం:** ఒక దేశమున పుట్టి పెరిగిన వారందురు ఒకే జాతివారనచ్చును మనది భారతజాతి, భాష, మతము, సంస్కృతి, ఆచార, వ్యవహారములు ఒక్కటైనను, కాకున్నను, ఒకే ప్రభుత్వ పాలన క్రింద ఉన్నవారందరు ఒకే జాతియని చెప్పబడును. ప్రపంచములో వివిధ జాతుల వారు ఉన్నను, ప్రతిజాతికి తమజాతిపట్ల, సంస్కృతిపట్ల, నాగరికత, చరిత్రపట్ల ఒకవిశిష్టమైన గౌరవ భావముండుట సహజం, మతములు వేరైన, భాషలు, రాష్ట్రములు వేరయినను ఒకే గొడుగు క్రింద అనగా ఒకే ప్రభుత్వ పాలన క్రింద వున్నవారు ఒకే జాతి వారుగ పరిగణింపబడుతారు. అట్లు కలిసి,మెలిసి, యుండటనే జాతీయసమైక్యత అంటారు భారతదేశములో, వివిధ,మత,భాష సంస్కృతి ఆచారములుగల వారున్నను, వారందరు భారతజాతికి చెందినవారే.

భారతదేశములోని ప్రజలు చిరకాలమునుండి ఏకజాతిగా నుండిరి. కాని బ్రిటీషుపాలకులు మనకు స్వాతంత్ర్యమును ఒప్పగించు సమయమున, ద్విజాతి సిద్ధాంతమును లేవదీసి అఖండభారతాన్ని రెండు ముక్కలుగా విడదీసి ఇండియా, పాకిస్థాన్ అను ఏర్పాటు వాదాన్ని లేవదీసి మనలో మనకు చిచ్చుపెట్టిపోయిరి తత్ఫలితమే, నేటి పాకిస్తాన్ ఆవిర్భావం. అంతకుముందు భారతీయులలో కనిపించు దౌర్భల్యము, అనైక్యత, మతచాందసము అసరాగా తీసుకొని బ్రిటీష్‌వారు మనలో మనకు (సంస్థానాధీలలో) వైరభావములు రగుల్కోలిపి అధికారములను చేజిక్కించుకొనిరి నేటికిని మనదేశఔన్నత్యమును సహింపలేని విదేశీయులు కొందరు మనదేశములోనే ఉండి, మనలోని సమైక్యతను దెబ్బదీయ్యా, అలజడులు సృష్టించుచున్నారు. మతబేదములు, పెంచి, హత్యలకు సిద్ధపడుచున్నారు. మతద్వేషములను పెంచి సమైక్యతను భంగపరుచుచున్నారు. ఇట్లు కొన్ని ప్రాంతీయ పార్టీలలో దురభిమానములుపెరిగి, పరస్పరము కలహించుకొనుట ప్రత్యేక రాష్ట్రముల కొరకు సమ్మెలు, వాకౌట్లు, నిరసనలు, జేస్తు జాతీయ తమపహాలు చేస్తు ఐక్యతను దెబ్బదీస్తు అశాంతిని కల్గించుచున్నారు. అందుచేత అందరము ఒకటేనన్న భావాన్ని కల్గించుటకై మన ఐక్యరాజ్యసమితి జాతీయ సమైక్యతా మండలిని స్థాపించినది. దాని శాఖలు రాష్ట్రములలో వెలకొల్పి ప్రజలలో ఐక్యభావాన్ని పెంపొందింప ప్రయత్నించుచున్నది. ఇందుకు అనుగుణంగా ప్రజలు కూడ తమ తమ మతా, కుల, బాషా బేదములను విడిచి ఒకే తల్లిబిడ్డలుగా, ఒకేపాలక క్రింద తమయొక్క ఐక్యభావమును, ప్రదర్శించి జాతిసమైక్యతను కాపాడుకొనుట అవసరము. జాతి సమైక్యతే దేశానికి శ్రేయోదాయకం.

# లేఖలు

**ఉత్తరములు నాలుగు విధములు**

1. వ్యక్తిగత లేఖలు 2. వ్యాపార లేఖలు
3. వ్యవహార లేఖలు 4. సాంఘిక లేఖలు అనునది.

**వివరణ:-** 1. వ్యక్తిగతము అనగా మిత్రులు, బంధువులు ఒకరి కొరకు వ్రాసుకొను సమాచార సంబంధమైనది.

ఇందులో

2. ఉత్తరము వ్రాయువారి నివాసం మరియు తేది కుడి ప్రక్కన పై భాగమున
3. పిలువు ఎవరికి వ్రాస్తున్నామో వారిని సంభోదిస్తూ, ఉత్తరానికి ఎడమ వైపు పై భాగమున
4. ప్రధాన విషయము అనగా వ్రాయదలచుకొన్న విషయాలు.
5. ముగింపు విషయాలు పూర్తి చేయుట
6. సంతకము క్రింది భాగమున కుడి ప్రక్కన వ్రాసిన వారిది.
7. చిరునామ ఉత్తరం అందవలసిన వారి అడ్రస్ కవరుపైన.

## నమూనా లేఖ

గుడిపల్లి

పూజ్యులైనా నాన్న గారికి తేది 4-2-99

ఉభయ క్షేమానంతరం

**విషయం :** 10వ తరగతి పరీక్ష ఫీజు ఈ నెల 20 వరకు చెల్లించవలెనని ప్ర.ఉ. వారు చెప్పినారు కావున రూ॥ 100/-లు యం.ఓ చేయగలరు.

**చిరునామా**

శ్రీ కె. మూర్తి రాజు

పోస్టు : పమ్నూరు వాంపల్లి మండలం,

నల్లగొండ జిల్లా - 508 242.

**వారియొక్క అడ్రస్**

కె. రవి శేఖర్

10వ. తరగతి, రూల్ నెం. 6

జెడ్.పి.హెచ్.యస్. గుడిపల్లి.

# ప్రధానోపాధ్యాయునికి సెలవు పత్రము

ఊట్లపల్లి

తేది 20-3-99

గౌరవనీయులైన ప్రధానోపాధ్యాయులు,

జి.ప.ఉన్నత పాఠశాల

పులిచర్ల గారికి

**విషయము** : వివాహ సందర్భమున సెలవు గురించి.

**ఆర్యా,**

మా సోదరి వివాహము నిశ్చయమైనందున, పెండ్లి పనులలో సహాకరించుటకు 5 రోజులు తేది 21-5-99 నుండి 25-3-99 వరకు సెలవు పెట్టి రమ్మని మా తల్లి దండ్రులు చెప్పిపంపారు.

కావున దయవుంచి 5 దినములు సెలవు ఇప్పించగలరని నాయొక్క మనవి.

ఇట్లు

**ఆర్. రవి కుమార్**

10వ తరగతి నెం. 16

జి.ప.ఉపా. పులిచర్ల.

# విజ్ఞాన యాత్ర గురించి మిత్రునికి లేఖ

జి.ప. హైస్కూల్
పులిచర్ల
తేది 15-2-99

ప్రియమైన మిత్రుడు టి. రంగారావుకు

నీ మిత్రుడు వై. రవి వ్రాయునది ఇక్కడ అంతా కులాసా, నీవు కూడ క్షేమమేనని తలుస్తాను.

మా పాఠశాల నుండి 10వ తరగతి విద్యార్థులము మరియు మా తరగతి టీచర్ గారి ఆధ్వర్యమున తేది 3-2-99 న హైద్రాబాదుకు విజ్ఞాన యాత్రకై బయలుదేరితిమి - మాకు సమీపములోని పెద్దవూర మండలం నుండి హైద్రాబాదు-మాచర్ల ఎక్స్‌ప్రెస్ బస్సులో వెళ్ళి అక్కడకు వెళ్ళిన తర్వాత "నగర దర్శనం" అనే బస్సు సర్వీసుకు టిక్కెట్లు తీసుకొని, హైద్రాబాదు నగరములోని, చూడదగిన స్థలములు, చార్మినార్, మాక్కామసీదు సాలర్ జంగ్ మ్యూజియం, నెహ్రూ జూవాలాజికల్ పార్క్, గోలకొండ దుర్గము, అసెంబ్లీ భవనం మరియు రామోజీ రావు ఫిల్మ్ సిటీ మొదలగునవి దర్శించితివి. తిరిగి సాయంత్రం 7 గంటలకు హైటెక్ బస్సుతో పెద్దవూరకు చేరుకొని ఆటోలలో పులిచర్ల వసతి గృహము చేరినాము, సిటీలో చాలవింతము, చూచితిమి వాటిన గూర్చి నీకు వివరముగా ఉత్తరములో వ్రాయజాలను నీవు పులిచర్లకు వచ్చినట్టుగా అన్ని సంగతులు సమక్షములో మాట్లాడుకుందాం తప్పక వచ్చే ఆదివారం రాగలవు

ఇట్లు
వై. రవి
10వ తరగతి, రూల్ నెం. 20
పులిచర్ల

**చిరునామా**
టి. రంగారావు
10వ తరగతి రూల్ నెం. 56
యస్.టి. హాస్టల్, గాంధీ నగర్,
దేవరకొండ - 508 248.

తేది : 15-2-1999

పులిచర్ల

జి.వి.రమణ

10వ తరగతి,

జడ్.పి.హెచ్.యస్. పులిచర్ల

శ్రీయుత గౌరవనీయులు

పోస్ట్ మాస్టర్ హెడ్ పోస్టాపీసు నల్లగొండ గారికి

**విషయము :** రెవెన్యూ స్టాంపులు, పోస్టుకార్డుల కొరత గురించి

**ఆర్యా !**

మా గ్రామములోని పోస్టాపీసులో గత వారమునుండి పోస్టుకార్డుల కొరత ఏర్పడినది ఆలాగే రెవెన్యూ స్టాంపులు కూడా లభ్యం కావడం లేదు.

మా గ్రామపోస్టు మాస్టర్ గారిని అడిగితే పైకి వ్రాసాను అని సమాదానమిస్తున్నారు. ఒక వెయ్యి కడప గల అతిపెద్ద గ్రామములో ప్రతిరోజా పోస్టు కార్డు అవసరము చాలయుండును కావున దయవుంచి త్వరగా పూనుదహరించిన వస్తువుల కొరతమ దీర్చగలరని మనవి.

ఇట్లు

**జి.వి. రమణ**

పులిచర్ల.

# గ్రామపారిశుద్ధ్యము గురించి లేఖ

తేది: 12-2-1999

పులిచర్ల

**కె. రవి కుమార్**

10వ తరగతి, జి.ప.ఉపా పులిచర్ల.

శ్రీయుత శానిటరీ ఇన్స్పెక్టర్

పెద్దపూర (మండలం)

గారికి,

మా గ్రామములో నెలరోజుల నుండి కొన్ని వాడలలో నివసించు వారికి మలేరియా జ్వరములు, వచ్చుచున్నవి మరియు వర్షముల మూలమున, బజారులో మురికినీరు చేరి దోమలకు నిలయములైనవి కావున మా గ్రామమును దర్శించి జ్వరపీడితులను ఆదుకోగలరు. గ్రామ సర్పంచ్ గారికి బజార్లను శుభ్రపరుచు కార్యక్రమములు చేపట్ట సూచవలివ్వగలరని కోరుచున్నాను.

ఇట్లు

**కె. రవి కుమార్**

10వ తరగతి.

పులిచర్ల.

# ఫిర్యాదులేఖ

పి.ఎ.పల్లి
తేది 10-3-1999

కె. రవి కుమార్
10వ తరగతి
రూల్ నెం 19
జి.ప.ఉ.పా., పి.ఏ.పల్లి

గౌరవనీయ సబ్ఇన్స్పెక్టర్ పోలీస్ స్టేషన్ గుడిపల్లి గారికి

ఆర్యా !

ఈ రోజు ఉదయం మా పాఠశాల ఆవరణలో నాసైకిలు పెట్టి తరగతికి వెళ్లియుంటిని - క్లాసు అయిపోయిన తర్వాత వచ్చి చూడగ సైకిలు లేదు నా సైకిలు ర్యాలి రకం నెం 15231 గలది దయచేసి ఎంక్వయిరీ చేయించి నా సైకిలును తిరిగి పొందుటకు సహాయము చేయగలరని ప్రార్థన.

ఇట్లు
కె. రవి కుమార్
రూల్ నెం. 19
10వ తరగతి
జడ్.పి.హెచ్.యస్. పి.ఏ.పల్లి.

494' 813504
UEN
Acc NO. 25826